# ఆంధ్రమహిళ

am-Feb-1947-3-17-18



FEBRUARY '47 ANDHRA MAHILA ANNAS 6


బ్రిటన్‌లోని ఆంగ్లేయులు తేసీటిని మొదటిసారి రుచి చూచి
నది 17వ శతాబ్దములో, అప్పటినుండి ప్రపంచమందెల్ల
చోట్లనుండు ఆంగ్లేయులు తేసీటిని తమకు ప్రియమైన పానీ
యముగా భావించుచున్నారు. బ్రూక్‌బాండ్ టీ తాజాగా
కమ్మని వాసన గలిగియుండుటచే భారతదేశములో చాల
మట్టుకు అందరి ఇండ్లలో ఉపయోగింపబడుచున్నది.




Brooke
Bond
Tea

విడుదల! త్వరలో విడుదల!!

ఆంధ్ర దేశములో అన్ని కేంద్రములలో ఒకేసారి బ్రహ్మాండమైన విడుదల

శ్రీ వెంకట్రామా పిక్చర్సు వారి

# బ్రహ్మరథం ★

దర్శకుడు:
చిత్రపు నారాయణమూర్తి, బి. ఎ.

తారాగణం;
అద్దంకి
పారుపల్లి
రఘురామయ్య
ఎ.వి. సుబ్బారావు
కుంపట్ల
సదాశివరావు
వి. కోటేశ్వరరావు
నాగుమణి
రామారావు
కె. యస్.
రంగనాయకులు
వి. శ్రీనివాసరావు
జయమ్మ
సరోజ
సౌదామిని
శ్రీరంజని
టి. కనకం
చిట్టి
కుమారి
అనసూయ.



పాటలు, మాటలు
బలిజేపల్లి

నృత్యం:
వెంపటి

ఆర్టు:
శర్మ

స్టూడియో:
శోభనాచల

ఆంధ్ర:— పూర్ణా పిక్చర్సు, గాంధీనగర్, బెజవాడ.
రాయలసీమ:— మల్లికార్జున పిక్చర్సు, నంద్యాల.
నైజాము:— దక్కన్ ఫిలిం డిస్ట్రిబ్యూటర్సు, హైద్రాబాద్.

వివరములకు:— టి. పి. సుందరం, బాలాజీనగర్, రాయపేట, మదరాసు.



## కృతజ్ఞత

శ్రీమతి పురం అన్నపూర్ణమ్మ గారు ఆంధ్ర మహిళాసభకు వివిధ శాఖలకు అవసరమైన ఎనేమిల్ సైనుబోర్డు లన్నీ శాశ్వతంగా ఉండేవి—పెద్దవీ చిన్నవీ—చక్కగా తయారుచేయించి కానుకగా యిచ్చినందుకు వారికి సభవారు కృతజ్ఞత తెలియపరుస్తున్నారు.

శ్రీమతులు అద్దంకి సుందరమ్మగారు, గోదావరీబాయిగారు, మిసెస్ యం. వి. పాత్రుని, మిసెస్ సదాసివంగారలు తలొక వంద రూపాయిలు యిచ్చి మహిళా సభకు యావజ్జీవ సభ్యురాండ్రుగా యెన్నుకోబడ్డారు. వీరికి కూడా కృతజ్ఞులం.

శ్రీమతి జె. జమునాబాయి,
శ్రీమతి ఎ. చన్నఘంటమ్మ కృష్ణారావు
కార్యదర్శినులు.

# ఆంధ్ర మహిళ


మైలాపూరు :: ఫిబ్రవరి 1947 :: మదరాసు


: ముఖచిత్రం :




సంవత్సర చందా  అయిదు రూపాయలు




సంపుటి 3 ఫిబ్రవరి 1947 సంచికలు 17, 18

# స్త్రీ జాతి అభ్యున్నతి

స్త్రీల యొక్క అభివృద్ధినిగూడ గాంధిజీ నిర్మాణ కార్యక్రమంలో చేర్చారు. సత్యాగ్రహం మూలంగా స్త్రీలు తామున్న అంధకూపంలోనుంచి స్వయంగా బయటకు వెలువడిన మాట వాస్తవమే. ఇంకొక విధంగా స్త్రీలు ఇంత త్వరలో, ఇంత సులువుగా ముందుకు వచ్చివుండేవారు కారు. కాంగ్రెస్ వాదులు స్వాతంత్ర్య పోరాటంలో స్త్రీలుకూడా సమాన భాగస్వాములుగా వుండడం అవసరమని గమనించలేదు. సంఘ సేవకు స్త్రీ నిజమైన సహకారిగా వుండడం అవసరమని కూడా వారు గుర్తించలేదు. స్త్రీ ప్రాచీన ఆచారం మూలంగాను, చట్టం మూలంగానూ అణగి పోయి వుంది. ఈ అధోగతికి పురుషుడే బాధ్యుడు. స్త్రీకి ఎంత మాత్రం దీనితో సంబంధంలేదు. అహింసాత్మకమైన జీవితంలో తన జీవిత పద్ధతిని నిర్మించడానికి పురుషునికున్న అధికారం స్త్రీకి కూడ వుంది. కనుక సంఘాభివృద్ధికి ఏర్పడే చట్టాలకు ఇద్దరి సహకారం, సలహా అవసరం. ఇట్టి చట్టాలను బలవంతంగా వ్రాసు చేయడం అన్యాయం. పురుషులు స్త్రీల పట్ల తాము చూపే ప్రవర్తనలో ఈ అన్యాయాన్ని పూర్తిగా గుర్తించలేదు. స్త్రీలను మిత్రులుగానూ, సహకర్మిణులుగానూ చూచే దానికి బదులు తామే ఖామందులమనీ, ప్రభువులమనీ పురుషులు అనుకుంటున్నారు. భారతీయ స్త్రీలకు చేయూత నిచ్చి వృద్ధిలోకి తీసుకువచ్చే అవకాశం కాంగ్రెసు వాదులు కల్పించుకోవాలి. జీవితమంతా బానిసత్వంలోనే ఉంటూ స్వాతంత్ర్యం పొందగలమనే జ్ఞానం లేని పాతకాలపునాటి బానిసల స్థితిలో మన స్త్రీలున్నారు. ఎప్పుడైనా స్వాతంత్ర్యం వస్తే ఏమి చేయాలో తెలియకుండాకూడా వారి స్థితివుంది. స్త్రీలకు, తాము పురుషుల సొత్తులమని భావించేటట్లు పురుషులు వారికి నేర్పించేరు. తమకు పురుషులతో సమానమైన అంతస్తు వుందనీ, తాము కూడా పురుషులతో సమానంగా పాటుపడవలెననే దృష్టి స్త్రీలకు కలిగేటట్లు కాంగ్రెసు వాదులు పని చేయాలి.

మనం కావాలనుకుంటే ఈమార్పు కష్టంకాదు. కాంగ్రెసువారు తమ యిండ్లలోనే మొదట పనిప్రారంభించాలి. భార్యలను మనం ఆటబొమ్మలలాగ భోగపాత్రలలాగ చూడకూడదు. మనం చేస్తూవున్న సేవలో సమానంగా పని చేసే మిత్రులలాగ మనం వారిని చూచుకోవాలి. ఈ వుద్దేశ సిద్ధికోసం పని చేయడానికి కావలసిన చదువులు స్త్రీలు తమ భర్తల దగ్గరనుండి, జ్ఞానాన్ని సంపాదించుకోవాలి. మన తల్లుల విషయంలోను, కుమార్తెల విషయంలోనూకూడా మనం యీ గౌరవాన్నే చూపించాలి. నిస్సహాయలైన భారతీయ స్త్రీలను గురించి మాత్రమే చెప్పి, అట్టి పురుషుల విషయమై గాంధీగారేమీ అనలేదని ఎవరూ ఏమీ అనుకోవద్దు. గ్రామాల్లో సాధారణంగా స్త్రీలకు పురుషులతో సమానమైన అంతస్థు వుందనీ, కొన్ని ఇళ్లల్లో రాజ్యమే వారిదనీ వారికి తెలియక పోలేదు. కాని నిష్పాక్షికంగా బయటినుంచి చూచే వాళ్లకు స్త్రీలకు పరిపాటిగా వస్తూవున్న అంతస్తు, చట్టపూర్వకంగా వున్న హక్కు, న్యాయ పూర్వకమైనది కాదనీ, అందులో సమూలంగా మార్పు కలగాలనీ తప్పక అంతా ఒప్పుకోవలసిందే.





" వరుడు వధువుపేరు, వధువు వరునిపేరు చెప్పరేని
గడపదాటి గృహమునందు అడుగిడ నే నొప్పుకోను "

(చిత్రకారుడు : బుజ్జాయి)



హంసా మెహతా

నానారాజ్యసమితిలో మానవహక్కుల భద్రతకు

పాటుబడుచున్న భారత ప్రభుత్వ ప్రతినిధి





అమ్ము స్వామినాథన్

మలయాలో స్వతంత్ర భారతదేశమునకు

ప్రాతినిధ్యము వహింపనున్న 'డిప్లొమేట్'

# స్త్రీ కర్తవ్యము - స్త్రీ విద్య

శ్రీమతి కె. అమ్మాజీగారు

" చదువని వా డజ్ఞుండగు
చదివిన సద సద్వివేక చతురతగలుగున్
చదువగవలయును జనులకు ...... "

అన్న మహాకవి పోతనామాత్యుని పల్కులు మన స్త్రీ జనముల కెంతేయు వర్తించును. 'సద్వివేకము', 'చతురత' యీ రెండును స్త్రీకి తన కర్తవ్య నిర్వహణకై ఎంతయు అవసరము. స్త్రీకి గల కర్తవ్య మేమి? ఆ కర్తవ్య నిర్వహణకై ఆమెకు ఎట్టి విద్య అసరము? అనెడి విషయములకు యీ చర్చ దారితీయుచున్నది :

స్త్రీల కర్తవ్యమును గూర్చి సూక్ష్మముగా దెలుపవలెననిన స్త్రీ కర్తవ్యములు 'మానవ సృష్టి', 'మానవ సేవ'. సృష్టికి మూలకందము స్త్రీ. " ప్రకృతి కర్త్రీ పురుషస్తు పుష్కరవన్నిర్లేపః " అన్న సాంఖ్యమత సూక్తి స్త్రీ యౌన్నత్యమును ఎలుగెత్తి చాటుచున్నది. స్త్రీమూర్తిలో సృష్టికార్యమునుఇమిడ్చి భగవంతుడు ఆమెకు అసమానగౌరవం కలుగజేసెను. దీనితో ఆమె బాధ్యతగూడ యెక్కువయైనది. సృష్టించుటయేగాక, సృష్టించినవారిని ఆరోగ్యవంతులుగ పెంచి, సంఘమునకు అలంకారముగ తర్ఫీదుజేయవలసిన బాధ్యతగూడ ఆమెపై బడినది. స్త్రీ పురుషు లిరువురు ఒకరికొకరు సృష్టింపబడిరని, వారి ప్రేమ మానవసృష్టికిమూలమని, పురుషుడు స్త్రీకి'మిత్రుడ'ని, స్త్రీ పురుషునకు 'సఖి'యని వేదములు దెల్పుచున్నవి. " అర్థం భార్య మనుష్యస్య, భార్యాశ్రేష్ఠ తమస్సఖాః "; స్త్రీ పురుషుని అర్ధాంగి, అతని శరీరములో ప్రశస్త అర్ధ భాగం (బెట్టర్ హాఫ్). పురుషుని అర్ధాంగియై ఆమె గృహిణి, ధర్మపత్నియగుచున్నది. ధర్మపత్నిగా ఆమె భర్తకొరకై నిర్వర్తింపవలసిన కర్తవ్యములనిర్వహణకు ఆమెకు ఎంత వివేకము, చతురత కావలెను! గృహలక్ష్మియై ఆమె సంఘమునకు చేయవలసిన కర్తవ్యములు కొన్ని. గృహిణి కర్తవ్యము లింకను కొన్ని గలవు; అందు ముఖ్యమైనవి —సృష్టి —మానవ సృష్టి — ఆ సృష్టించిన బిడ్డలకు విద్యాబుద్ధులు గరపి సంఘ శ్రేయస్సునకు ఒప్పజెప్పవలసిన బాధ్యతగూడ నామెదే. ఇది సామాన్య కార్యమా? బిడ్డల తర్ఫీదనిన ఎంతకష్టము! ఈ కర్తవ్య నిర్వహణకై ఆమెకు ఎంత జ్ఞానము, సామర్థ్యము కావలెను! ఇందులకై ఆమెకు ఎట్టి విద్య అవసరము? ఈ విద్య మరల బిడ్డలకు నేర్పునదిమాత్ర మెవరు? తండ్రియా? —గురువా? మాతయా? మాతయే. ప్రథమ గురువు మాత —గురువులకు గురువు మాత! " గురూణాం చైవసర్వేషాం, మాతా పరమకో గురుః " (మహా భారతం). సమస్త గురువులలోను ప్రథమ గురువు మాత! " ఉపాధ్యాయాన్ దశాచార్య, ఆచార్యాణాం శతంపితా, సహస్రంతు పిత్రూన్మాతా గౌరవేణా తిరచ్యతే " అని మనుధర్మ సూక్తి.

" ప్రజానార్థం మహాభాగాః, పూజార్హా గృహదీప్తయః స్త్రియః శ్రియశ్చ గాహేషు,
నవిశేషోస్తి కశ్చన "

సంతానోత్పత్తికి కారణులగుటచే స్త్రీలందరు కళ్యాణ పాత్రులు, ఆదరణయోగ్యులు అగుచున్నారు. వీరు గృహమును తేజస్వంతముగా జేయుచున్నారు. స్త్రీలు గృహమునకు శ్రీ స్వరూపులు. శ్రీకిని స్త్రీకిని విశేష బేధమేమియు లేదు.

వేయిమాట లేల — స్త్రీజాతి అభివృద్ధిలో సంసారాభివృద్ధి, సంఘాభివృద్ధి అన్నియు నిమిడియున్నవని తెల్పిన చాలును. ఏలనన, ప్రతి మనుష్యుని కనునది స్త్రీ, పెంచునది స్త్రీ, సద్బుద్ధులను గరుపునది స్త్రీ, మరల పురుషుని ప్రేమించి సుఖాబ్ధి నోలలాడించునది, సర్వ పురుషార్థముల నందజేయవలసినది స్త్రీ. అతనికి మంత్రియై, సంసార నౌకకు చుక్కానియై, సుఖజీవయాత్ర జేయించి సంసార సాగరమును దాటించవలసినది స్త్రీ. ఏ విధముగ జూచినను లోక కళ్యాణమునకు; దేశాభ్యుదయమునకు, స్త్రీ జనాభ్యుదయమే ప్రథమ సోపానమై యున్నది.

" ఏ రాజ్యంబున దరుణులు దారుకళా కుశల
సుస్వతంత్రులు గలరో
ఆ రాజ్యంబున బురుషులు, ధీరులు, నధికారుల
మలధీసు విచారుల్ "

ఇది యెంతయు సత్యము. దేశాభ్యుదయమునకు స్త్రీ జనా

# తల్లి - కూతురు



లీల :—ఒరే! అబ్బాయీ! సినీమాకు వెళ్లాలి గదా. అక్క తయారుగా వుందా ?

అబ్బాయి —లేదే! ఇప్పుడే ఇంకా సున్నం కొట్టుకుంటుంది.

లీల :—ఇదేమిటిరా సున్నం కొట్టుకుంటుందా!

హేమ :—(లోపలినుంచి పరుగెత్తుకు వచ్చి) వీడి పొగరు చూసావా? నేను పౌడరు రాసుకుంటున్నానని వేళాకోళం చేస్తున్నాడు. వొరే శుంఠా! వుండు, వుండు —నీ వీపు.........

లీల :— ఉస్! వాడిని ఎందుకు కోప్పడతావ్! వాడు చెప్పినదాంట్లో తప్పేముంది. నీ మొఖము మీద పౌడరు మచ్చలు మచ్చలుగా సున్నము కొట్టినట్లుగానే వుంది.

హేమ :—(ఏడ్పుముఖం పెట్టి) దానికి నేనేమి చెయ్యాను ?

లీల :—నీ వేమీ కష్టపడక్కరలేదు. ఒక బుడ్డి (జాబ్ కో స్నో) కొనుక్కో. ముందు స్నో వ్రాసుకో. ఆ వెనుక పౌడరు కొద్దిగా రాసుకో. అప్పుడు పౌడరు ముఖమంతా సమానంగా, అందంగా పడుతుంది. పౌడరు రాసుకున్నట్లుగానే కనబడదు. అప్పుడే చెరిగిపోకుండాకూడావుంటుంది. ముఖముకూడ చాల కాంతిగా వుంటుంది.

★ జాబ్ కో స్నో ★



## స్త్రీ కర్తవ్యము - స్త్రీ విద్య

భ్యుదయమునకు విద్య—సద్విద్య ప్రథమ సోపానము. సద్విద్య లేనిదే సద్వివేకము, చతురత లభించవు.

మన కర్తవ్యమును మనము గమనించిన వెనుక ఆ కర్తవ్య నిర్వహణకై మనకు ఎట్టి విద్య తర్ఫీదులు అవసరము అనునది రెండవ ప్రశ్న.

'విద్య' యన నిప్పటి పాఠశాలలు, కళాశాలల విద్యయే మన స్ఫురణకు వచ్చుచున్నది. విద్యయన నేమి?—మానవుల మానసిక నేత్రమును వికసింప జేసి జ్ఞాన జ్యోతులను, విజ్ఞానమును, వివేకమును గలిగించునది విద్య. భుక్తి, యుక్తి, శక్తి, రక్తి, భక్తి, ముక్తిదాయకమైనదియే విద్య. ఇవి శబ్దాలంకారమునకై ఉపయోగింపబడిన పదములుగావు; వానిలో ఏ యొక్క దానిని కలుగజేయలేకున్నను అది విద్యయే గాదు. శరీర పోషణార్థమై భుక్తి అవసరము; లోక వ్యవహార నిర్వహణకై యుక్తాయుక్త వివేకముతో గూడిన యుక్తి ముఖ్యము; ఇహలోక జీవనమునకై కొంత శక్తి కావలెను; సద్గ్రంథ పఠనకు, సద్గోష్టికి, ఆనంద జీవనమునకు రక్తి అవసరము; భక్తి ప్రదాతగాని విద్య "అవిద్య" ముక్తిసాధనకుపకరింపని విద్య విద్యయేకాదు.

కాని ఇప్పటి మన బాలబాలికలభ్యసించెడి విద్యలు పైవాటి కన్నిటికి పెడ ముఖములై యున్నవి. ఇవి మనకు మన బిడ్డలకును నిరర్థకములగుటయే గాక పై పెచ్చు అనర్థదాయకములుగూడ నగుచున్నవన్న విషయము ఎల్లరకు విశదమే. యూనివర్సిటీ ఛాన్సలర్ అయిన శ్రీ రాధాకృష్ణన్ వంటి విద్యాధికారియే యీ విషయము ఆమోదింపక తప్పినది గాదు. అఖిల బెంగాలు కాలేజీ అండ్ యూనివర్సిటీ టీచర్ల సంఘములో వారు నుడివిన నుడువులు :—"గవర్నమెంటువార లేర్పరచిన విద్యా విధానము స్త్రీ పురుషుల కొకటియేనై—మనము ప్రభువుల చేతిలో కీలు బొమ్మలై తిరుగాడునట్లు చేయునది. తమ స్వగౌరవమును కాపాడుకొనుచు—స్వతంత్ర జాతికి చెందిన ప్రజలమని మన మనుకొనునట్లు జేయదు. ఏ విధమైన అభివృద్ధికైనను స్వదేశాభిమానము ప్రధానము. మిగత దేశములలో యీ విషయము గుర్తింపబడినది. కాని మన దురదృష్టదేశమున పరిస్థితులు తారుమారైనవి. స్వతంత్ర రహితమైన జాతికి ఉత్సాహము, స్వసామర్థ్యమునందు నమ్మకము ఉండదు. ఇతర దేశీయులకు మనము సమానుల మన్న మాట మరచెదము. అన్ని దాస్యముల కంటె మానసిక దాస్యము కడుహీన కరము. ఇది స్వప్రయోజకతను మరిపింపజేయును. దేశాభిమానము, స్వగౌరవమును సజీవముగా నుంచుటయే విద్యయొక్క యదార్థ ఆశయము. ధనము పోగొట్టుకొనినచో నేడుగాకున్న రేపైన దానిని తిరిగి సంపాదింపవచ్చును. దేశాభిమానము పోగొట్టుకొంటి మేని మనకు మరి ముక్తి లేదు."

విశ్వమానవ సౌభ్రాత్రమునకై విశ్వభారతిని స్థాపించిన ఠాగూర్ మహాశయునివంటి విద్యా ప్రదాత గూడ మన విద్యలను గూర్చి, స్త్రీ విద్యను గూర్చి తన అభిప్రాయము నిట్లు తెలియపరచెను :—

"మన దేశమున చదువ నేర్చిన వారు నూటికి పదిమంది. ఆ పదుగురిలో స్త్రీల సంఖ్య ఒక్కటి మాత్రమే! మానవ జాతిని తన యొడిలో పెంచి ప్రయోజకులనుగా జేయవలసిన మాతృదేవత, ప్రథమ గురువై జీవిత పాఠముల నేర్పవలసిన మాతృదేవత, సృష్టికర్త తనకు ప్రసాదించిన అమోఘశక్తుల నుత్తేజింపజేసుకొని మహీతలమును మహాస్వర్గముగా జేయవలసిన మాతృదేవత—విద్యా విహీనయై, అంధకారమున, అజ్ఞానమున తొట్రుపడుచున్నది! ఇంత కంటే శోచనీయాంశమింకొకటిగలదా! దాని నివారణోపాయము కంటె మనకు ప్రథమ కర్తవ్య మింకొకటి కలదా?" అన్నారు.

ఒకప్పుడు—

"పాటలరీతి బాడుదురు భారత వర్షమునందు నంగనల్
హాటక గర్భునోట నుదయంబగు వేదమునందు నర్థముల్
తేటగ భారతాదుల! సుధావరగాథలఁ........"

అనిపించుకొనిన భారత నారీమణుల ప్రజ్ఞ యిప్పుడేమైనది? ఎంతవరకు పతన మందినది? ఎందుల కట్లైనది? మన అవివేకమువలన అంధానుకరణమువలన, అజ్ఞానమువలన, మన దృక్పథము మారుటవలన, చిత్త విభ్రమమువలన పాశ్చాత్త్య ప్రభువుల పాలనవలన, మన బాలబాలికల విద్యా విధానము లీరీతిగా నుండుటవలననే. ఇప్పటి పుస్తకములవలన ఒక పుణ్యమా, పురుషార్థమా, జ్ఞానదాయకమా? నీతి, భక్తి దాయకమా? ఇక యువతీయువకు లన్ననో —"థామ్సన్ వ్రాసిన గ్రంథము వారి త్రికాల పఠనమున కనువగుచున్నది గాని తిక్కన సోమయాజి వ్రాసినది త్రిప్పియైన జూడరు." మాట మాట్లాడిన మిల్టన్, గోల్డు స్మిత్, షేక్స్పియర్ కవుల రచనలు, మాటలు జ్ఞప్తికి వచ్చును గాని, వారికి

# స్త్రీ కర్తవ్యము - స్త్రీ విద్య

మన కాళిదాసు, నన్నయ, బమ్మెర పోతనాదుల మాట మచ్చుకైన రాదు. యువకునితోబాటు యువతికూడ ఎ (ప్లస్) బి (హోల్ స్క్వేర్ ఈజ్-యీక్వల్ టు) అంటూ ఏమేమో నని వప్పజెప్పగలదుగాని బంట్రోతు దెల్పిన బజారు లెక్కలు బొమ్మ కట్టుకొనవలసినదే. ఏది జూచినను నిరర్థకము, నిష్ప్రయోజకము. నిత్యజీవితముతో సంబంధరహితమైనదియే గాని లోకజీవనమునకు ఉపకరించునది ఇసుమంత యుండదు. ఒక శాస్త్రజ్ఞుడు తన జీవిత చరిత్రలో నుదహరించినట్లు "మన బాలురు విదేశవస్తువులు తయారగు పద్ధతిని (ఉదాహరణ) అగ్గిపుల్లలు జేయుపద్ధతిని తుచ తప్పకుండ మందులపాళ్లతో సహా పాఠము వర్ణించగలరు గాని రెండు అగ్గిపుల్లలు జేసి ఆ రోజు తాను సిగరెట్లు కాల్చిన ఖర్చులో శతాంశము నార్జింప నేరరు గదా." ఇరువది యైదేండ్లు అహోరాత్రములు కృషి సల్పి, అమూల్యమగు తన జీవితమును, కష్టార్జితమగు తండ్రిగారి ధనమును వేలకొలది ఖర్చుబెట్టి, కృషి సల్పి విద్య నభ్యసించిన మన బాలబాలికలు కుటుంబమును, సంఘమును, దేశమునకు బరువై—బ్రతుకుచుండుట ప్రత్యక్షముగ జూచుచుండుటకంటె — మన ప్రస్తుత విద్యావిధానముల నిరర్థకతను దెల్పుటకు ఋజు వేవి కావలెను? ప్రస్తుత విద్యలవలన కొంతలోకజ్ఞాన మలవడక పోదు. కాని అది ఎంతవరకు మన కర్తవ్య నిర్వహణకు ఉపయోగించును అను విషయమును గమనించవలసియుది.

ఇట్టి "అవిద్య"లు గాక నిజమగు "విద్య"—సద్విద్య, దేశీయతా భావముల పెంపొందించు విద్యలు, మన బాలబాలికలకు గల్పించినగాని మన యిప్పటి పరిస్థితులు మారవు. అందు స్త్రీ విద్య వేరైయుండవలెను తమ కర్తవ్య నిర్వహణకు వారిని సమర్థులనుగా తయారు జేయునదియై యుండవలెను. ఈ విషయమై మన విశ్వ విద్యాలయములను నడుపు శ్రీ రాధాకృష్ణన్, ఠాగూరు మున్నగు వారలేగాక స్పెన్సర్ రస్కిన్ మున్నగు పాశ్చాత్తులు గూడ ఏకగ్రీవముగ అంగీకరించిరి. ఆరోగ్య జ్ఞానము, ఆహార జ్ఞానము, బిడ్డల పోషణ, కుట్టుపని, ఉద్యాన కృషి మున్నగు నిత్యకృత్యములందు ఉపయోగించు విషయములు నేర్పబడవలెను. వివేకముతో అనవసరవ్యయములు మాని పొదుపుగా సంసారము జేసికొను విధానము బోధించవలెను. అనవసరములగు నగలకు పెండ్లిండ్లకు వృధావ్యయపరచు అలవాట్లు తగ్గవలెను. అజ్ఞానముతో గూడిన పిచ్చినమ్మకములు పోవలెను. లలిత కళలగు సంగీత సాహిత్యాదులు నేర్పబడవలెను. బాలికలకు వారివారి తాహతులకు అనుకూలమైన విద్యలు నేర్పించిన మరియు మంచిది. వితంతులకు జీవనోపాధి కుపకరించు ప్రత్యేక విద్యలు లాభదాయకములు. తన యొక్కయు బిడ్డలయొక్కయు శరీరమునను పోషించుటెట్లు, ఆరోగ్యకరములగు ఆహారము తయారు జేయుటెట్లు, మనస్సుకు అభివృద్ధి, ఆనందము కలుగజేయు లోకవ్యవహారములు వివేకముతో నిర్వర్తించుటెట్లు, బిడ్డలు ప్రయోజకులై కుటుంబమునకు అలంకారములై యుండు రీతిని తర్ఫీదు జేయుటెట్లు, గృహిణియై భర్త, బిడ్డలయెడ తన కర్తవ్యములను నిర్వర్తించుటయెట్లు, సార్వజనిక జీవితము నందెట్లు ప్రవర్తించవలెను, ప్రకృతి తనకు ప్రసాదించిన సౌఖ్యసౌధములను ఉపయోగించుకొని తనకు పరులకు అత్యంతముగా ఉపకరించునట్లు చరించుటెట్లు, తన శరీరమానసిక శక్తులను సద్వినియోగపరచుకొని సర్వతోముఖ సుందర జీవితమునకు పునాదివేయు టెట్లు? ఈ లోకతంతు అంతయు నెందులకు? తాను తనవారు అందే నిమగ్నులై యుండక ఇహలోక భయ విషాదములనుంచి విముక్తి నంది నిత్యానంద సుఖశాంతులు చెంద మరయగలుగు టెట్లు మున్నగు విషయములన్నియు స్త్రీకి దెలియవలసినవే. స్త్రీ తన కర్తవ్య నిర్వహణకై 'ఏమి తెలిసికొనవలెను' అన్న ప్రశ్నకు ఆమెకు 'ఏమి తెలియ నక్కరలేదు?' అను ప్రశ్నయే జవాబు!

మానవజాతిని తనయొడిలో పెంచి, ప్రయోజకులుగా జేయవలసిన మాతృదేవత, ప్రథమగురువై జీవిత పాఠములను నేర్పవలసిన మాతృదేవత, సృష్టికర్త తనకు ప్రసాదించిన అమోఘశక్తుల నుత్తేజింప జేసుకొని మహీతలములు మహాస్వర్గముగా జేయవలసిన మాతృ దేవత- విద్యా విహీనయై, అజ్ఞానమున దొప్పదోగుచున్నది! ఇంతకంటె శోచనీయాంశ మింకొకటి కలదా!! దీనిని సరిదిద్దుటకంటె మనకు ప్రథమ కర్తవ్య మింకొకటి కలదా!!!



# సంక్రాంతి పండుగ అంతరార్థం

పూర్వాచార పరాయణులుగాక, శాస్త్ర దృక్పథంగలవారుండే యీ కాలంలో సూర్యుడు ఉత్తరానికి మళ్లే ఉత్తరాయనం అన్నా, లేదా అరవవారి 'పొంగల్' అన్నా యింత ప్రాముఖ్యత యెందుకని కొందరు ఆశ్చర్యపడవచ్చు. ఎందుకంటే, ప్రతి నాగరికతాగూడ ప్రాత క్రొత్తల వింత కలయికేనని చెప్పాలి. ప్రతీ తరహాలోను ప్రాత తరహాలన్నీ సంక్షేపంగా ఉంటాయి. క్రొత్త తరహాయొక్క సూచనలుంటాయి. మనకు వ్యక్తిగతంగా సంక్రమించే వంశసాంప్రదాయాలే గాక మనకు సాంఘికంగా సంక్రమించే గొప్ప సాంప్రదాయాలుంటాయి. ఇదే నాగరికతయొక్క సారాంశమని చెప్పొచ్చు. ప్రతీ పిల్లవాడూ మనిషికి తండ్రి యౌతాడన్నట్లే మానవుడనేవాడు భూతకాలంయొక్క బిడ్డ. మన బూడిదల్లో మన జీవజ్యోతు లుంటూనే ఉంటాయని, సమాధులనుంచి కూడా ప్రకృతియొక్క వాక్కు పలుకుతుంటుంది.

మన అర్ధగోళానికి, అందు ముఖ్యంగా హిందూ దేశానికి సూర్యుడు ఉత్తరాభిముఖు డయ్యేకాలం చాల ప్రాముఖ్యమైంది. మన ఆరోగ్యాలు, మన జీవితాలు దీనితో సంబంధించి ఉన్నాయి. దినాలు కొంచం వెచ్చన, కాంతిమంతమూ గలవియౌతాయి. ప్రాతకార్తుల బంధాలు సడలుతుంటాయి. కొద్దికాలంలో సూర్యుని తీక్ష్ణ కిరణాలు భూమిని అట్టుడికినట్టు ఉడికించి మంచి సారవంతంగా చేస్తాయి. భూగోళంలో నీటి ప్రదేశాలనుంచి ఆవిరిని లాక్కొని, వర్షరూపంగా మళ్లీ ప్రసాదించేది సూర్యుడే. ఇది జరక్కపోతే, 'అధికాహారోత్పత్తి' ప్రచారమన్నది హేళనమాత్రమే యౌతుంది.

ఉత్తరాయనాన్ని గురించి మనకు భీష్ముడు అంపశయ్యపై నిరీక్షిస్తూ, పరున్న చక్కటి కథయొకటుంది. స్వచ్ఛంద మరణం అతనిచేతిలోనే యుందిగాని, తనఆత్మ స్వర్గాన్ని పొందడానికి ఉత్తరాయణం కోసరం నిరీక్షిస్తూ పరున్నాడు. హిందూ వేదాంతం ప్రకారం, మరణానంతరం ఆత్మకు



3 మార్గాలున్నాయి : దేవయాన అంటే, దేవలోకంలోకి మార్గం; దీనికి ఉత్తరాయనం అన్నది దిక్సూచికవంటిది. పిత్రాయన అంటే పిత్రులోకానికి మార్గం; నరక లోకానికి త్రోవ మూడోది-దీనివల్ల జననమరణాలుండే నరకానికి వెళ్తారు. దేవయానం సూర్యలోకానికి, పిత్రుయానం చంద్రలోకానికి దారితీస్తాయి. అంపశయ్యపై విశ్రమించిన భీష్ముడు యీ ధర్మాలన్నీ ధర్మరాజుకు చెప్పాడు. ఉత్తరాయణ పుణ్యకాలం ప్రారంభం కాగానే, తన నేత్రాలు, మనస్సు, హృదయమూ కూడ తనయెదుట నున్న శ్రీ కృష్ణుని దివ్యరూపంలో యోగధ్యానంవల్ల లయంగావించి, శరీరాన్ని విడచి, దేవయానం వెంట స్వర్గలోకానికి చేరుకున్నాడు. రథసప్తమి, భీష్మతర్పణ కథలుకూడా మనకు జ్ఞాపకముండాలి. ఇలాగ ఉత్తరాయణం పుణ్యకాలం మన హిందువులకు గొప్ప ప్రాముఖ్యమైనది. భోగిరోజున ఆంధ్రలోక మంతటా ఆబాలగోపాలం తైలస్నానాలు గావించి, భోగి మంటలు వేస్తారు. దక్షిణాదివారికి తాయిమాసం మొదటిరోజు పొంగల్ అంటారు. వరిపిండితో చేసిన రథంబొమ్మ లాగుతారు; దాంట్లో సూర్యచంద్రుల్ని సూచిస్తూ సున్నలు, చంద్రరేఖా కృతిని పిండిముగ్గులు పెడతారు. పూజదగ్గర, భూదేవి మీద పండించిన క్రొత్త పంటలు చెరుకు గడలు, పసుపు మొక్కలు ఉంచి, సూర్యభగవానుణ్ణి ఆరాధిస్తారు. అరవంలో పొంగల్ అంటే వండిన బియ్యం. చక్కెర పొంగల్ అని చక్కెర, బియ్యపన్నం, నెయ్యితో చేసిన పలహారం సూర్యభగవానుడికి నైవేద్యం పెడతారు. కుటుంబంలో పిల్లలంతా పొంగలీ - ఓ - పొంగలీ అని భజన చేస్తారు. పెద్దలుకూడా సర్దాగా దీంట్లో పాల్గొంటారు. కుటుంబీకులంతా కలిసి ఆనందంగా యుండేరోజుగా, హాయిగా, వినోదదినంగా గడుపుతారు.

ఇలాగ ఉత్తరాయణ పుణ్యకాలమన్నా, పొంగల్ పండుగ అన్నా, రెండు విధాలా కూడా పేర్కొన్నా, ఇండియా అంతటికీ యిది జాతీయ పర్వదినం - పండుగ

రోదానను. మర్నాడు 'కనుమ' లేక కన్ను పొంగల్ అంటారు. ఆ రోజు కుటుంబంలో నున్న ఆడ పిల్లలకు గొప్ప వినోదదినం; వీరికి అంతా బహుమతులిస్తా రీరోజున. నదియొద్దనో, తటాకంయొద్దనో వెళ్లి, రంగురంగుల బియ్యం ఉండలు నదీదేవతకు నైవేద్యంగా ఉంచుతారు — జంతువులు, పిట్టలు, చేపలూ తినాలని. ఆ తర్వాతరోజు 'మాటు పొంగల్' అంటే, పశువుల్ని అలంకరించి పూజించే దినం. వీటి కొమ్ములకు రంగువేస్తారు. మెడల్లో జీలుగబెండు పూల దండ వేస్తారు. తలకు ఇత్తడి గొలుసులు పెడతారు. సాయంత్రం వాటిని పరుగెత్తించి, ఎవరి పశువులు ముందు పరుగెడతాయోనని పశువుల యజమానులు పోటీలు చేస్తారు. ప్రజలందరూ ఈ పరుగుల్లో పాల్గొంటారు. గోవులకు అరటి పళ్లు, అన్నపు ఉండలు వగైరా తినబెడతారు.

తెలుగు ప్రాంతాల్లో నెలపట్టినప్పటినుంచీ గృహప్రాంగణాల్లో ముగ్గులు, వీధుల్లో గండిరెడ్డాటకులు ముఖ్య సూచనలు. పిల్లలు భోగిదండలు గుచ్చడం, భోగిమంటలకు కర్రలు సంపాదించడం, బాలికలకు ముగ్గులు నేర్చుకుని ప్రదర్శించడం, గృహాలంకరణాది కళాప్రదర్శనలు, పెద్దలకూ, పిన్నలకూ పండగరోజుల్లో పొట్టపూజలూ ఉంటాయని చెప్ప నక్కరలేదు.



# సంక్రాంతి రోజుల్లో సాధారణ దృశ్యం



డూ! డూ! డూ! అప్పన్నా!!

# భార్యా — భర్తలకు

శ్రీ స్వామి శివానంద, (ఋషికేష్)

'ది డివైన్ లైఫ్' పత్రికలోని వ్యాసానికి స్వేచ్ఛానువాదం.

భార్యా భర్తలకు మధ్యను అభిప్రాయ భేదాలు కలిగి ఇళ్లల్లో, రోజూ ఏవో కలహాలేర్పడుతుంటాయి. తన భర్త తనకు సర్వదా అనుకూలుడై యుండాలని భార్య వాంఛిస్తుంది గాని, యిది సాధ్యమా? సాధ్యం కాదు. అంచేత వీరు గంట గంటకూ పోట్లాడు కుంటారు; అంటే, ప్రతీసారీ గుద్దులాటలవరకు వెళ్లక పోవచ్చుగాని రోజుకు కొన్ని గంటలు మాట్లాడు కోడం మానేస్తారు! భర్త కొంచం కోపిష్టి, ఓర్పు లేనివాడూయైతే గుద్దులు పడుతుంటాయి లేదా బెత్తం దెబ్బలు తగులుతుంటాయి. ఒకొక్కప్పుడు కోపం పట్టలేకపోతే, పాత్రలు పోగొడుతుంటాడు! భార్య గనుక సోక్రటీస్ సతి లాంటిదిగాని, లింకోలిన్ సతిలాంటిదిగాని యైతే యీ పద్ధతి తలక్రిందు లౌతుంది. ఉరుములు ఉరిమి, మొగుడు నెత్తిమీద మిరియాలు నూరి నంత పని జరుగుతుంది! ఒకొక్కప్పుడు భార్య కోపించి, వంట మానేసి మంచమెక్కి దుప్పటి కాళ్లారా బిగదన్ని ముసుకు పెట్టేసుకుని ఏ కడుపు నొప్పో తల నొప్పో వచ్చిందని మూలుగులు మొదలెడుతుంది! పాపం భర్త ఏ హోటలుకో వెళ్ళి, రెండు మెతుకులు మింగి, బస్సుకో, ఎలెక్ట్రిక్ రైలుకో పరుగెత్తి ఆఫీసుకు హాజరౌతాడు. భార్య ఒకొక్కప్పుడేమి చేస్తుంది—భర్తకు చెప్పకుండానే — పుట్టింటికి తయారౌతుంది. వెర్రిబాగుల భర్తగారు సిగ్గువిడిచి, అంత మనోదార్ఢ్యంలేక, అత్తగారింటికి వెళ్లి భార్యకు కొత్త కొత్త ప్రమాణాలు చేసి, బ్రతిమిలాడు తాడు.

భర్తగారికి యిష్టమైన వంటకాలు తయారు గాక పోతే, చివాట్లకు సిద్ధపడి ఉండాలి— భార్యగారు. ఇలా చినచిన్న వాటిని గూర్చి, ఏదో రేపి పోట్లాట పెట్టుకుంటుంటారు, రోజూను! ఈ స్వల్ప విషయాలన్నీ చెప్పాలంటే చాల గ్రంథం పెరుగుతుంది. చాల మందికి వి స్వానుభవంవల్ల బాగా తెలిసే ఉంటాయి.

ఐనా సరే, ఏ గృహస్థునైన అడిగి చూడండి "గృహస్థు జీవితం మంచిదా, బ్రహ్మచారి జీవితం మంచిదా?" అని అడగండి. "గృహస్థు జీవితం, బ్రహ్మచారి జీవితం కంటె వేయిరెట్లు మంచి" దంటాడు! అని, తన మాటలు సమర్థించుకో డానికి పిచ్చి వాదనలలోకి దిగుతాడు. మీకు ఒక కథ జ్ఞాపకముందా ఒక రాజు పందై పుట్టి, పంది పిల్లల్ని వేసుకుని ఆనందించిన కథ? ఈ విషయంకూడా ఆలాంటిదే.

ప్రజలకు యుక్తాయుక్త వివేక జ్ఞానంగాని, వ్యామోహంలో తగులోకుండా నిశితంగా ఆలోచించే సామర్థ్యంగాని ఉండదు. అంచేత యదార్థాన్ని ఉన్నది ఉన్నట్లు గుర్తించలేరు.

---

## సుఖజీవనానికి సూత్రాలు

---

కామం, వ్యామోహం, అజ్ఞానం వగైరాలవల్ల వారి బుద్ధి సామర్థ్యానికి మసక గమ్మి మరొక దృక్పథంనుండి చూస్తుంటారు. అంచేత వారు చేసే దేమిటో వారికే తెలియదు.

కామోద్రేకులైనప్పుడు, ప్రొద్దుట గ్రుద్దు లాటలన్నీ అంతట్లో మర్చిపోతారు భార్యాభర్తా కూడాను. తమ జీవితం ధన్యమైందను కుంటారు. అప్పుడు మట్టుకు — పువ్వుల్లో పెట్టినట్లు మాట్లాడు కుంటారు—హృదయాల్లో ప్రేమ సున్నమైనప్పటికీను!

ఆత్మ సంయమం పొందడానికి కృషిచేయండి. కామాతీతులు కండి. పరిశుద్ధులు కండి. సత్ప్రవర్తన నభివృద్ధి జేసుకోండి. కోపాన్ని వశంలో నుంచుకోండి. జపం, కీర్తన, ధ్యానం, గీతాధ్యయనాలు క్రమ రీతిని సాగించండి. "గృహస్థులకు సలహాలు," "జీవితంలో జయం పొందడానికి, దైవసాక్షాత్కారం పొందడానికి అమోఘ సూత్రాలు" అన్న పుస్తకాలవంటివి చదవండి. తెలుసుకున్న విషయాల్ని నిత్య జీవితంలో ఆచరణలో పెట్టండి.

ఓ రాముడా! నీ భార్యను దేవిగా భావించు, ఆమె గృహసామ్రాజ్యానికి రాణి, గృహానికి లక్ష్మి. "యత్ర నార్యస్తు పూజ్యంతే తత్రరమంతే దేవతః" స్త్రీలు పూజింపబడే చోట ఐశ్వర్యం, సౌభాగ్యం, జయం, శాంతియుంటుంది. ఓ లీలా! పార్వతివి కమ్ము, భర్తతో కలహింపకుము. సావిత్రి, అనసూయ, సీతవంటి సాధ్వీమతల్లుల్ని ఆదర్శకంగా నుంచుకుని ప్రవర్తించు.

మీ రంతా భక్తి—శ్రద్ధలుగల వారలై, నిష్కల్మష జీవితాలు జీవిస్తూ, యీ జన్మం లోనే ధన్యులగుదురు గాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః



# నిర్మలాదేవి గ్రంథాలయము

## (ఆంధ్ర మహిళా సభ)

జనవరి, ఫిబ్రవరి నెలలు మనదేశములో పంటలరోజులు. సమృద్ధి, సంతృప్తి కనిపిస్తూ వుంటవి. మరి నిర్మలాదేవి గ్రంథాలయమునకూ అంతే. శ్రీమతి మంత్రిప్రగడ రంగనాయకమ్మగారు ఆంధ్ర వాఙ్మయ విషయికమైన గ్రంథాలు నూటపది ఇచ్చారు. శ్రీమతి జొన్నలగడ్డ కామేశ్వరమ్మగారు 13, శ్రీమతి తిరుమల భాగ్యలక్ష్మమ్మగారు 16, శ్రీమతి శంకరమంచి శ్రీదేవిగారు 6, శ్రీమతి టి. సుశీలగారు విలువయిన డిక్షనరీలతో 30 గ్రంథములు, శ్రీమతి డోకా ఈశ్వరి 2, శ్రీ ఆంధ్ర పత్రికాధిపతులు 25 ఇంగ్లీషు పుస్తకములు గ్రంథాలయమునకు బహూకరించారు. 'ఆంధ్ర మహిళ' 20 తెలుగు పుస్తకాలను ఇచ్చింది. మొత్తము మీద గ్రంథాలయమునకు యీ నెల 202 కొత్త గ్రంథములు వచ్చినవి. ఇంక ఆంధ్ర మహిళా సభ కూడ చిన్నచూపు చూడలేదు. కొత్త తెలుగు నవలలు కొనటానికి 25 రూపాయలు, గ్రంథాలయములో వున్న పెద్ద బల్లచుట్టు వేయటానికి 12 చక్కని కుర్చీలు ఆశీస్సులతో ఇచ్చింది. నిర్మలాదేవి గ్రంథాలయము సకల విధాల వున్నతి పొందటానికి సహకరిస్తూ అమూల్యమయిన సంక్రాంతి కానుకలను ఇచ్చిన పై దాతలందరికి హృదయపూర్వకమయిన కృతజ్ఞత. ఆంధ్ర మహిళలు సదవకాశమును పురస్కరించుకుని, గ్రంథాలయ పఠనమందిరములను సద్వినియోగపరుచుకుంటున్నందుకు అభివందనాలు.

అచ్యుతుని గిరిజ,
కార్యదర్శిని.



# సేవ

సేవ గావించుటకే నీకు అధికారములదు; ఈ అవకాశము లభించినచో నీవు నిజముగ ధన్యుడవే. నీవు ప్రపంచమును గాని సంఘమును గాని ఉద్ధరించ నేరవు; సేవ గావించుటయే నీవు చేయగలపని—అని శ్రీ రామకృష్ణపరమహంస, వివేకానందుల దివ్యసందేశము. ఇటీవల నొకరు శ్రీ రమణమహర్షిని సందర్శించి, 'నేను లోకుల నుద్ధరించుటకై జీవితమును ధారబోయునటుల దీవింపుడ'ని వేడుకొన, 'నిన్ను నీవు ఉద్ధరించుకొనుము. నీవును లోకములో నొక భాగమే. నిన్ను నీ వుద్ధరించుకొనినచో లోకము నుద్ధరించినటులే' నని వాకృచ్చెనట. పెద్ద పెద్దలందరు యిటులే దెల్పెదరు.

'సేవ' యనునది నిజముగా మానవ జాతి కొక గొప్ప వరప్రసాదము. సేవ బహువిధములు. స్వాతంత్రత పోగొట్టుకొనిన ప్రజలను ప్రబోధించి దేశసేవ గావించవచ్చును; గ్రంధముల రచించి, పాటలు కూర్చి భాషసేవ గావించవచ్చును, తద్వారా దేశసేవ కూడ జరుగవచ్చును. రోగములతో నిడుములగుడుచు వారికి మందుల నిచ్చి, ప్రజాసేవ గావించవచ్చును. ఆర్తజనుల కన్నపానీయముల నొసంగి వారిని సేవించుటయు, సేవయే. ఇటులనేక విధములుగా సేవ గావించి తరించుట కనేక అవకాశములున్నవి. ఈ సేవగావించుటయందును ప్రతిఫలా పేక్షా రహితమై, కేవలము ఈశ్వరార్పణగా గావించినసేవయే ఉత్కృష్టమైనదని పెద్దలు దెల్పెదరు. "కర్మణ్యే వాధికారస్తు—మాఫలేషు కదా చన"అని గీతా వాక్యం. చేత నొక కానీ నుంచుకొని, యిదిగోనోయి బిక్షుకుడా యని నిరసనగా, వాని కది విసరుటగాదు, నీవు ధర్మము గావించుకొనుటకై యవకాశము నొసంగిన యా బిక్షుకునకు కృతజ్ఞుడవై యుండుమని శ్రీ వివేకానందుని ప్రవచనము.

దేశమున నిట్టి సేవ బహుముఖములుగా జరుగుచున్నది. పత్రికలు పలువిషయములగూర్చి ప్రజలకు దెలియ జెప్పుచు పెద్దల సందేశముల నందించుచు యథోచిత సేవ జేయుచున్నవి. మహిళా సంస్థలు అందందు వెలసి స్త్రీ లోకమున కపూర్వ చైతన్యము సేవ గావించుచున్నవి, ఇంకను గావింపనున్నవి. శ్రీమతి విజయలక్ష్మీపండిట్, సరోజినినాయుడు వంటి వక్తలు మానవుల ప్రాథమిక హక్కులను గురించి ప్రపంచమున కెలుగెత్తి చాటునదియు సేవా ధర్మముల ననుసరించియే. హరిజన సేవ, ఆర్తజన సేవ గావించుచు ప్రస్తుతము కల్లోలిత కలకత్తా ప్రాంతములలో పర్యటన మొనర్చుచున్న గాంధిజీ వంటి వారు—ప్రభుత్వ భారము వహించి ప్రజల రాజకీయ, అర్థిక, సాంఘిక, నైతికాది బంధముల చేధించి, 'సర్వజనో సుఖినో భవంతు' యన్న పెద్దల యాశీస్సులు ఫలింపజేయ కృషి సల్పు ప్రజానాయకులవంటి వారు—భారత దేశ భవితవ్యమును నిర్ణయించుటకై సమావేశమై కార్యక్రమను నడుపు ప్రజా పరిషత్తు సభ్యులవంటి వారు—ఇటులు ప్రజాహితమును గోరి గావించు వారల కృషి సర్వము సేవయే. ఇవి ఒక్క భారత దేశమునకే గాక విశ్వమానవ సౌభ్రాత్రము, విశ్వమానవ సౌహార్ద్రములను స్థాపింపనెంచి గావించు సేవలు.

సంఘములో విద్యావంతులను ప్రబోధించి, 'పతిత జనుల యెడ సానుభూతి వహించి, వారి అభ్యుదయమునకై కృషి చేయుడు—మానవ సేవయే మాధవ సేవ'—యని కర్తవ్యమును బోధించుచు, మానవ జన్మ మహత్తర పూర్ణమైనదని, మోక్షసాధకమని హెచ్చరించుచు—ప్రపంచ వ్యాప్తమైన శ్రీ రామకృష్ణ మఠములు గావించుచున్నదియు విశ్వమానవ సేవయే. వీరి సేవ బహుముఖములు. అన్నాతురులకు అన్నము, విద్యార్థులకు విద్య, వివిధ రోగులకు వైద్య సహాయము సమకూర్చుచు, మోక్షార్థులకు—'స్వీయమోక్ష ప్రాప్తిచే నేమి లాభము? దరిద్రనారాయణ సేవ గావించుట యందు నిమగ్నులరై మీ మోక్ష చింతలను దూరముగ నుంచుడ'ని ప్రబోధించుచు గావించు సేవ మానవ జాతి కంతకును జెందినదై, మానవుల సర్వతోముఖాభివృద్ధికై యత్నించునదైయున్నది. గ్రామ వాసులు, పట్న వాసులు సేవ యెల్లరు గావించునదియే గాని గొలుసుయొక్క బలము

దానిలో నల్పమైన లింకును బట్టియుంచునని, సంఘములో అట్టి లింకు అరణ్య ప్రాంత ఆటవికులు గనుక వీరికి సేవ గావించవలసి యున్నదని సూచించుటయే గాక శ్రీ పేరంటపల్లి స్వామిజీ వంటి వారు ప్రత్యక్షముగా అఖండ సేవ గావించుచున్నదియు అందరికీ యెరుకయే.

ఇటులే పండిత పామర జన సేవ కార్మిక కర్షక జన సేవ సంఘములో నన్ని యంతస్థుల వారి యొక్క సేవ విడివిడిగాను సమగ్రముగాను గావించు సేవా పరాయణులు, గ్రంథ కర్తలు—పత్రికా నిర్వాహకులు, పురుషులు—స్త్రీలు, పెద్దలు—పిన్నలు పలు విధములుగా గావించుచు దేశము, భాష, సంఘము, మానవ జాతి యెడల తమ కర్తవ్యములను నిర్వర్తించ బూనుట గొప్ప శుభ సూచకము. సేవాభిరతితో ముందుముందు ముందునకు రాగల బాల బాలికలు తర్ఫీదగుచుండుటయు గొప్ప సంతుష్టికరము.

సేవ యనెడు చిన్న పదమున అనంతావకాశములు, అనంత అర్థములు, పురుషార్థములు యిమిడి యున్నవని యెల్లరు గమనించి తరించెదరు గాక.

(కె. సు.)



# పిల్లలెందుకేడుస్తారు?

శ్రీమతి సి. హెచ్. అరవిందాదేవిగారు








పిల్ల లేడ్చినప్పుడు తల్లులు సాధారణంగా చేసేపనులు ఎంతమాత్రం లాభించవు. తక్షణం ఏ పాలో, మిఠాయో, రొట్టె - బిస్కట్టో పెడుతారు. దీనివల్ల ఫలితం ఉండొచ్చు; లేకపోవచ్చు. కాని, ప్రస్తుతవిషయం అదిగాదు. చెప్పేదేమంటే, అలా చేయడం తల్లిది తప్పని. దీనివల్ల పిల్లలకు ఏ అజీర్తో పట్టుకొని ఆరోగ్యం భంగపడుతుంది. ఆఖరుకు వాళ్లు మరికొంత ఏడుస్తుంటారు. పిల్లల్ని ఊరుకోబెట్టే మరొక సాధన ఏమిటంటె, ఏ రబ్బరుతిత్తో మరొకటో యివ్వడం. ఇది పిల్లల్ని ఒకమాదిరిగా మోసపుచ్చడమే ఔతుంది. రబ్బరుతిత్తి ఏమీ పాలివ్వదు సరిగదా, పిల్లలకు హాని చేస్తుంది. పాలుతాగే యీడు మరికొంచం పెరుగుతుంది. వారి ఎదుగు ఆగిపోతుంది.

పిల్లాడు యేడిస్తే, తల్లి అతణ్ణి ప్రక్కమీద నుంచి లేవనెత్తి ముద్దుపెట్టుకోవడమో, లాలించడమో చేస్తుంది. ఇదీ పిల్లలకు చెడుగే. తల్లి ఒడిలోకూర్చునే అలవాటు యేర్పడుతుంది. పిల్లల్ని వీలైనంతవరకు మంచంమీదనే ఉంచేయండి. పిల్లలు తల్లిఒడిలో నలిగేకంటె కాళ్లూ చేతులూ తన్నుకుంటూ మంచంమీద నుండడమే మంచిది. పిల్లలకు స్వేచ్ఛగా కదలడానికి వీలుంటేనే యిష్టం. నీవు అతణ్ణి చేయమన్న కోతి పనులన్నీ చేసేకంటె, తన యిష్టంవచ్చినట్టు మంచంమీదనే ఆడుకోవడం అతడి కిష్టం. నీ ఆట వస్తువులాగ అతడితో ఆడకు. దీనివల్ల అతడికీ నీకూ యిబ్బందులున్నాయి. ఎత్తులు నేర్పితే,యిక పడుకోడానికి యిష్టపడక గట్టిగా ఏడవడం పోరు పెట్టడం ప్రారంభిస్తాడు. అతణ్ణి యెత్తుకోవడంవల్ల అతడియిష్టానికి నీవు లొంగిపోయినదానవౌతావు.

ఏడ్పు మానిపించడానికి కొన్ని సామపద్ధతులు ప్రేమపద్ధతులు అయ్యాక యిక దండనలోకి దిగుతుంది. గట్టిగా ఏ చెంపకాయో కొడితే అతడు అంతకంతకు మరింతగట్టిగా యేడవడం జరుగుతుంది. అలా ఏడ్చే పిల్లాడు తన జీవితాన్ని, తనచుట్టూ నున్నవారి జీవితాల్ని దుఃఖభాజనంగా చేయడమేగాక, అనారోగ్యంగా తయారౌతాడు.

ఏడ్పుకు కారణాలు :—కొంతమంది పిల్లలు ఎందుకు తరుచు ఏడుస్తుంటారో కారణాలు చూద్దాం. ఆకలివేస్తే యేడ్వవచ్చు. లేదా, జీర్ణ

## పిల్లలెందుకేడుస్తారు

మయ్యేదానికంటె హెచ్చుగా పొట్టలో పడితే యేడ్వవచ్చు. తల్లి యీ విషయం శ్రద్ధగా గమనించాలి. పిల్లాడు ఏడ్చినంతనే, తక్షణమే ఆకలిగానున్నాడన్న నిర్ణయానికి రాకూడదు. పిల్లాడు ఆఖరుసారిగా ఏమిటి తిన్నాడని ఆలోచించాలి. పిల్లాడి కేదైనా నొప్పివస్తే యేడుస్తాడు. లేదా, దేన్నిగురించియైనా భయపడి యేడ్వవచ్చు. తల్లి పిల్లాణ్ణి శ్రద్ధగా పరీక్షించి, అతడు తన శరీరాంగాల్ని వేటినైనా తాకుతూ చూపిస్తున్నాడేమో గమనించాలి. ఆ అంగాన్ని గాని, ప్రాంతాన్ని గాని తల్లి మెత్తగా నొక్కి-చూస్తే, పిల్లాడు చూపే ముఖచిహ్నాల్ని బట్టి ఏదైనా బాధ ఉందేమో కనుక్కో-వచ్చు. పిల్లాడు రెండుకాళ్లూ యెత్తి, మంచాన్ని బాదుతూ, బొటనవేలు చీకుతూ యుంటే, అతనికి పాలివ్వవలసిన టైమని నిశ్చయించు. అతడి కళ్లల్లో భయము గోచరిస్తే, తల్లి అతడిభయాన్ని పోగొట్టడానికి ప్రయత్నించాలి పిల్లలు—భయం అన్నప్పుడు, అందరు తల్లులూ జ్ఞాపకముంచుకోవలసిన దేమిటంటే — పిల్లల్ని భయపెట్టడం చాల తప్పుపని అని. మామూలుగా పిల్లలకు వర్షమన్నా, ఉరుమన్నా, కుక్కలన్నా, బూచోడన్నా భయముండదు—తల్లులు ఒకసారి తెచ్చిపెడితేనే వస్తుంది.

ఈగలు, దోమలు పిల్లల కళ్లు, తలదగ్గర ఎగురుతూ గాని, కుట్టి గాని పిల్లల్ని యేడ్పిస్తాయి. అలాంటప్పుడు పిల్లాణ్ణి, అతడి పరిసరాల్ని శుభ్రంగా యుంచితే వీటిబాధ తగ్గుతుంది. పిల్లాడి యేడ్పూ తగ్గుతుంది. తల్లుల శ్రమా తగ్గుతుంది.



# సౌందర్యపోషణ

శ్రీమతి ఆర్. రమాబాయిగారు



సౌందర్యమును తెలియనివారు లేరు. గాని దీని నాద్యంత్యముగా తెలిసినవారుకూడా అరుదు. సౌందర్యమువల్ల మనుష్యునికి సంతోషము, తృప్తి, శాంతి, మాత్రమే గాక, నవజీవనము, ఉత్సాహము కలుగుచున్నది. సౌందర్యముచే వికసింపని హృదయము ఉండదని చెప్పడం అతిశయోక్తి కానేరదు. సౌందర్యానికి దాసులు కానివారెవ్వరు? జితేంద్రియులైన తపోధనులు, ఋషులు, సన్యాసులు, మహాత్ములు, వీరాధివీరులు, మృత్యుంజయులు, చక్రవర్తులు, పండితులు, మరెవ్వరైనను సరే సౌందర్యమునకతీతమైన వ్యక్తి ప్రపంచమందెచ్చటను లేరని చెప్పవచ్చును.

ఇంతటి అమోఘశక్తిసంపన్నమైన సౌందర్యాన్ని సర్వవిధములా పోషించడం మానవుని విధాయకము. సౌందర్యమనగా యేమో దానిని పోషించుమార్గము లేవో సాంగముగా అవశ్యము తెలుసుకొనదగును.

మానవ సౌందర్యాన్ని రెండు విధములుగా విభజింపనగును. మొదటిది అంతర్గతమైనది. రెండవది బహిర్గతమైనది. అంతర్గత సౌందర్యమునకుపాధులు హృదయము, మనస్సు. వీటి పోషణ విధానములు సద్గుణములు, విద్య, క్షమ, దమ, దయ, సేవానిరతి, సత్యవచనము, పవిత్రదృక్కులు హృదయసౌందర్యమును, విజ్ఞానము, క్రమశిక్షణ మనోసౌందర్యాన్ని పోషించును. అంతరింద్రియ సౌందర్యము స్థిరమైనది. దాని పోషణమార్గముకూడా స్థిరమైనదే. దేశకాల పరిస్థితులుగాని, పంచభూతములుగాని హృదయసౌందర్యాన్ని భగ్నపరచనేరవు. గనుక, సర్వమానవులకు అంతరింద్రియ సౌందర్యపోషణ వాంఛనీయము.

మనుష్యులకు శరీర సౌందర్యపోషణకూడా అవశ్యమైనదే. శరీర సౌందర్యముచే హృదయసౌందర్యము ఇనుమడించును. ఏ విధముగా దీపముయొక్క గ్లాసు శుభ్రముగా ఉన్న దీపము పూర్ణకాంతి కలిగియుండునో అదే విధముగా బాహ్య సౌందర్యయుక్తమైన హృదయసుందరత పూర్ణమగును.

శరీర సౌందర్యపోషణ విధానములు రెండు. ఒకటి సహజమార్గము. రెండు కృత్రిమమార్గము. సహజమార్గము స్థిరమైనది. అన్ని కాలములందును, అన్ని దేశములందును ఆచరింపదగినది. పెద్దలకు వినయపూర్వకముగా తలవంచి నమస్కరించుట. తలకు, ఈర్ష్య, క్రౌర్యము, ద్వేషరహితమైన చల్లటి చూపులు కళ్లకు పరుల మనస్సును నొప్పింపని మృదువచనములు, నోటికి స్వార్థరహిత నిరంతర పరోపకారదీక్ష, చేతులకు సత్ప్రవర్తనము, శరీరమునకు దివ్యభూషణములనియు, వీటివల్ల సౌందర్యపోషణ ఇతోధికముగా జరుగుననియు చెప్పఁబడి ఉన్నది.

కృత్రిమ సౌందర్యపోషణకూడా మానవులకు అవశ్యము ఆచరణీయమైనదే. దీని విధానము దేశ, కాల, పాత్రాను

## అంతర సౌందర్యము బాహ్య సౌందర్యము రెండూ ఉండాలి

గుణముగా పరివర్తనము పొందుచుండును. దీనికి సహితము భారతీయ కళావేత్తలు ఉత్తమస్థానమునే ఒసగియున్నారు. కాని, ఇది పై రెండు విషయములకంటెను కనిష్ఠమైనది. దీనికి మూలము శరీరారోగ్యము, విలువగల వస్త్రాభరణములు మొదలైనవి. శరీరముయొక్క నైసర్గిక శోభను వృద్ధిపరుచు సుగంధ ద్రవ్యములు (టాయిలెట్స్) ఈ కృత్రిమ సౌందర్యము సహితము మనుష్యుని ఆకర్షించునదిగాను, సంతోష పెట్టునదిగాను ఉండు ననుటయందు సందేహము లేదు. పురాణ గ్రంథములలో కూడా దీనికి చాలా ప్రాముఖ్యత ఉన్నది. క్షీరసాగరకన్య స్వయంవర వర్ణనయందు :— త్రిమూర్తులు స్వయంవరమునకు వచ్చియుండిరనియు, మహేశ్వరుడు కృష్ణాంజన ధరుడై, సర్పభూషియై, విభూతి రేఖలతో ఉండినందువల్ల, కౄరముగాను, బిక్షుకునివలె కనిపించుటచేతను, బ్రహ్మ చతుర్ముఖుడై, పుస్పాసనుడై ఉండుటచే ఆనాగరీకునివలె కనపడుటచేతను వీరిద్దరు లక్ష్మిని మోహింప చేయలేక పోయిరనియు, పీతాంబరధారియై, శ్రీవత్స, వనమాలాలంకృతుడైన విష్ణువు ఆమెను సులభముగా బడయ కలిగెననియు వర్ణింపబడియున్నది. దీనిని బట్టి కృత్రిమ సౌందర్యము సహితము చాలా ఆకర్షణీయమైనదనియే చెప్పకతప్పదు. గనుక ఈ విధానమును (వేష భూషలను) శీతోష్ణస్థితులను, భారతీయుల రుచులను అనుసరించి నిర్ణయించుకొనవలెను. గాని ఏ పరదేశీయులనో అనుకరించుట నైతిక పతనమునకు పోషణ అగును కాని, సహజ సౌందర్యమునకు కాదు. సౌందర్యపోషణ విధానమునకు నాగరీకత (ఫ్యాషన్) అనికూడా అందురు. దీనికి పాశ్చాత్తులు ఎక్కువ ప్రాముఖ్యత నొసగుచున్నారు. జాతీయభావ శూన్యులైన భారతీయులు, ఈ విషయమందు వారిని అనుకరించుచుండుట చాల శోచనీయము. ఏ ఉపకరణములనైతే సౌందర్యపోషణకని వాడుచున్నారో, వాటివల్లనే సౌందర్య నాశనము కలుగుచుండుటను గుర్తించవలెను. కొన్ని (ఫేస్ పౌడర్స్) వల్ల చర్మమునందలి నూనె ఇంకిపోయి, నూనె గ్రంథులు మూతపడి, పొక్కులు మొదలైనవి బయలుదేరి, చర్మము గరుకుగా కళావిహీన మైపోవడము సంభవించుచున్నది. (ఐ బ్రోస్) వల్ల కళ్లు సహజదృష్టిని కోల్పోయి, సులోచనముల నుపయోగింపవలసివచ్చు నంతవరకైనను చెడిపోవుచున్నవనుట నిజము. (పొమేడ్స్) వల్ల మృదువుగాను, నల్లగాను ఉండవలెనని కోరబడు వెండ్రుకలు అకాలమునందే నెరసిపోవడము, కొన్ని సమయములందు పూర్తిగా రాలిపోవడము కూడా కద్దు. ఇదేవిధముగా చాలావరకు విదేశ వస్తువులను వాడుటవల్ల ఎంతో నష్ట, కష్టములు కలుగుచునే ఉన్నవి. (పై వస్తువులు స్వచ్ఛమైనవి లేనే లేవని కాదు కాని, చాలావరకు భారతీయుల కందుబాటులో ఉన్నవి. హానికరములుగా ఉన్నవని చెప్పుట సత్యదూరము కాదు.)

హిందూదేశమందు ఎంతో నాణ్యమైన పట్టు, ఉన్ని, నూలు వస్త్రములు లభ్యమగుచున్నను, విదేశ వస్త్రముల కొరకు నిత్యము ప్రాకులాడుచు, వీటిని ధరించుటయందు విదేశీయులను అనుకరించుట విచారకరము. దీనివల్ల ద్రవ్య నష్టమేగాని, సౌందర్యపోషణ మేమీ కలుగదనియే చెప్పవలెను. పైగా దీనివల్ల స్వతంత్ర భావము, జాతీయత, పూజ్యము.

ఈ నష్ట కష్టముల నెరిగియు అనేకులు, విశేషముగా స్త్రీలు లక్షలకొలది ద్రవ్యమును, విదేశవణిక్పుంగవులను కుబేరులను చేయుటకొరకు ధారపోయుచు, స్వదేశీయులైన సహోదరులను, తినుటకు అన్నము లేకయు, కట్టుటకు బట్ట లేకయు ఉంచుచున్నారనుట నిర్వివాదాంశము. ఈ సౌందర్య పోషణార్థమై విదేశవస్తువులకు, వస్త్రములకు ఖర్చుపెట్టుచున్న ద్రవ్యముచే స్వదేశ సౌభాగ్యాన్ని పోషించుచు, సౌందర్య పోషణకు దేశవాళీ వస్తువులు, పసుపు, కాటుక, తములపాకులు, గోరింటాకులు, కొబ్బరనూనె మొదలైనవి ఉపయోగించుకొనిన తమ సౌందర్య పోషణతోపాటు, స్వదేశ సౌందర్యాన్ని సహితము కాపాడగలరనుట ముమ్మాటికి సత్యము.






మహిళా విద్యాలయము
రాజ్యలక్ష్మీ పారిశ్రామిక విద్యాలయము
మల్లమదేవి మహిళామందిరము (హాస్టల్)

దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు
శిశుసంరక్షణాలయము
ఆంధ్ర మహిళ (స్త్రీల మాసపత్రిక)

కార్యదర్శిని, ఆంధ్ర మహిళాసభ, ఆంధ్ర మహిళా భవనాలు, మహిళాపురి, మద్రాసు.



# గృహిణీ ధర్మము

శ్రీమతి కె. జి. సుందరబాయిగారు

ప్రస్తుత, ప్రపంచమునందు, ప్రతి మానవకోటికిని, సర్వ కాలము సుఖముగా నుండవలయునని, కోరికయుండియే తీరును, కష్టముల నాశించరు, భాగ్యవంతులు కొన్నిసమయ ములందు సుఖపడవచ్చును, ఈ సుఖదుఃఖమిశ్రమైయుండును. ఈ తాత్కాలిక సుఖము ఇహసుఖము యల్లప్పటికిని స్థిరమై, శాశ్వతమైన ఆద్యంతములేని అనంతమైన సుఖము మోక్షము వలని బ్రహ్మానందమే మరివేరుగాదు.

ఆ పరమానందమును బొందుటకు పరమాత్ముని యను గ్రహమును సంపాదించి బొందుటయే ప్రధాన మార్గము ఆ పరమాత్ముని యనుగ్రహము బొందుటెట్లు? అనాదియగు పురాతనములైన వేదములు, మనుస్మృతులు, భగవద్గీత మొద లగు వాటిలో యుంచబడిన పురాతన ధర్మముల నవలంభించ వలయును ఈ పురాతన ధర్మములకే సనాతన ధర్మమని పేరు.

ఆ ధర్మములో స్త్రీలకు మాత్రము సంబంధించిన వాటిని నేను నేడు వ్రాయదలచితిని. సనాతన హిందూ గ్రంథముల యందు స్త్రీలు ఈ క్రింది వాటిని పాటింపవలెనని యున్నది ఇది హిందూమత స్త్రీ ధర్మము.

సనాతన హిందూ ఆచారములను బట్టి, వేకువజామున, తులసీ వందనము, మరియూ దేవతా ప్రార్థన, రెండవది గృహకృత్యములను చక్కగ చూచుకొనుట, పతి భక్తి ప్రధానమైనది పతికి హితముగా నడుచుకొనట ముఖ్య కర్త వ్యము. వైద్య శాస్త్ర రీతిగాను ధర్మ శాస్త్ర రీతిగాను బహి ష్టయైన వారు వేరుగా బయట కూర్చొన వలయునన్న విషయమందరికి బాగుగ దెలిసిన విశియమే.

సాత్వికాహారములను భుజింపవలెను. సాత్వికాహారమనగా ఆయుస్సు, బలము, ఆరోగ్యము, సుఖము, దేవునియందు ప్రీతి గలుగ జేయు ఆహారము, మాంసము తెల్లగడ్డలు ఎఱ్ఱ గడ్డలు రసవస్తువులు, మదము మాత్సర్యము గలుగజేయును భక్తి మార్గమున కాటంకము గలుగజేయును బుద్ధిమందము జేయును భక్తి మార్గము గోరువారు యీలాటి ఆహారమును తీసికొనరాదు మితభోజనము ముఖ్యము.

దేవ, ద్విజ, గురు, ప్రాజ్ఞపూజనముకూడా ముఖ్యము. పెద్దలను మిగుల గౌరవించవలయును. వారి వారి మతా చారములను యెప్పటికిని వదలకూడదు. ఇది చాల ముఖ్య మైనది మన మే యే కులమందు జన్మించితిమో ఆ యా కులాచారములనే యాచరించవలయును పరమాత్ముడు అన్ని జీవరాసులను పుట్టించెను గనుక భూతదయ ప్రాధాన్యము.

చేతనైనంత వరకు పరుల మనస్సుల నొప్పింపరాదు ఈలాగు పురాతన సనాతన ధర్మములలో నున్నది. వీటిని పాటించిన పరమాత్ముని కటాక్షము హెచ్చి మోక్షమును గాంచి శాశ్వతమైన ఇహపర సుఖమునను బొందెదము.





# సనాతన ధర్మములోని సందేశము

# స్త్రీ స్త్రీకి చేస్తున్న ద్రోహం

శ్రీ డి. శ్రీనివాసరావు

ఆనాడు నీవు నీ ప్రియుని పక్కనే వున్నావు. ఆమెకి, అతనికి అఘాతంలా అడ్డున్నావు. "దాసిగా నుండడానికైనా నోచుకోలేదా" అని దీనంగా దేవుళ్లాడింది ఆమె. "కావలసిన చాకిరీ చేస్తూ మిమ్మల్ని కనిపెట్టుకొని వుంటా, కనికరించండి" అని కాళ్లా వ్రేళ్లాబడింది. కళ్ల నీరు కార్చింది. "మొగుడు వదిలేసాడు అని మాటిమాటికి లోకులనే దెప్పుడు మాటలు పడ లేనండీ, పరువు దక్కించండీ" అని ప్రార్థించింది. పవిత్రమైన కన్నీటిచే పతి పాదాల్ని ప్రక్షాళన చేసింది. ప్రాధేయపడింది. "నా తప్పు లేమన్నా వుంటే క్షమించి నన్ను మీ దగ్గర వుండ నివ్వండి. మీ సౌఖ్యాల కేమీ అడ్డురాను. మీ సుఖంకోసం, మీ పాదాల దగ్గిఱ సేవ జేస్తూ నన్ను సుఖపడ నివ్వండి" అని పరిపరివిధాల పతిని బ్రతిమిలాడింది నిజసతి. తరతరాలనుంచి, యుగయుగాల నుంచి భారత నారీమణులకు "ఆభరణాలయిన" నిర్మలత్వాన్ని, నిర్దోష త్వాన్ని, నిస్సహాయతను ఆమె వదనారవిందము ప్రతిబింబింప జేస్తోంది.

నూతన వ్యామోహంలో పడిన అతనికి ఆమె అంటే అసహ్యం పుట్టింది. జాలిగొలిపే ఆదీన దీనాలాపా లాతని పీనుల కెక్కలేదు. పదేళ్ల క్రితం, పవిత్ర హోమధూపాలముందు, పెద్దల సమక్షాన, పావనమంగళ సూత్రాన్ని పట్టిన అతని చేతులు, నేడు ఏక పత్నీ వ్రతాన్ని మంట గలిపాయి. చట్టాలు సమ్మతించాయి. న్యాయ మూర్తులు నిర్ధారణ చేసారు.

పతిచే నిరాకరింపబడి, పంపివేయబడింది పతి వ్రతాశిరోమణి. ఎక్కడికి? అందరి నోళ్లలో పడమని! ఆమె బ్రతుకు కన్నవారికే బరువైంది. లోకుల మాటలు వాడిగల బాణాల్లా ఆమెను వెంటాడాయి. వేటాడాయి. బెబ్బులి బొబ్బలకు అదిరి, బెదిరిన హరిణంలా అయిపోయింది ఆమె బ్రతుకు. జీవిత శేషం క్లేశం. ఆ నాడు ఆమె పట్టరాని దుఃఖాన్ని చూసి వూరుకున్నావు నీవు. బింకంగా తలపంకిస్తూనుంచున్నావు. ఓదార్చ నన్నా లేదు! పాపం! ఆమె పమిటకొంగే ఆమెను ఓదార్చింది.

అతడు 'కవి' అని కులికి కామించావు. 'అందగాడ'ని ఆనందించావు. 'సంపాదకుడ'ని సంబరపడ్డావు. 'గాయకుడ'ని గర్వ పడ్డావు. 'తగినవాడ'ని తన్మయత్వం జెందావు. 'ప్రేమించి పెళ్లి చేసుకున్నాన'ని పెద్ద కబుర్లు చెప్పు తున్నావ్. 'సంఘ సంస్కారిణి' నని చాటు కుంటున్నావు నీవు. కాని నీవు చేసిన పని? మీ స్త్రీ జాతికి తీరని ద్రోహం!

ఆమె ఆనందాన్ని మంటగలిపావు. ఆమె జీవి తాన్ని దుఃఖ భాజనం చేసావ్. కామాంధకా రంలో పడియున్న నీవు ఆమె క్షోభని కానలేక పోతున్నావు. అతన్ని వివాహమాడావు. అన్యా

యంగా పరుల సొమ్మును దొంగిలించిన చోరుని కన్న నీచురాలవు నీవు. నీ కోసం, నీ సుఖం కోసం, నీ వాంఛలు సఫలత జేసుకోడం కోసం, నీవు పాటుపడ్డావు. అదే నీ కోరిక. నీ కోరిక యీడేర్చుకోడం కోసం, నీ స్వార్థం కోసం తోటివాళ్లను వుసురుపెట్టావు స్వార్థంతో నిండిన పురుషునికి సహాయం జేస్తున్న నీవు సంఘ సంస్కారిణివి కావు. నీది ప్రేమ కాదు. పశుత్వం. కేవలం వాంఛమయ జీవితం. త్యాగంలేని ప్రేమ, కామం. మానవత్వం లేని వారినైజం.

మిమ్మల్ని అధమస్థితిలోనుంచిన సంఘాన్ని, వారికి వీలుగా నీతులను నియమించిన సంఘాన్ని, తమ స్వేచ్ఛకోసం, తమ సుఖంకోసం మిమ్మల్ని బానిసల చేసిన సంఘాన్ని సమూలంగా నాశనం జేయడానికి కంకణం కట్టుకొన్నతోటి సోదరీమణుల ఐక్యతను విచ్ఛిన్న పరుస్తున్నావు. అభివృద్ధి నిరోధకులను అడ్డుకోడానికి బదులు ఆహ్వానిస్తున్నావు. వారి ఆటలు సాగడానికి ఆట వస్తువుగా వుపయోగపడుతున్నావు. మిమ్మల్ని నిస్సహాయులుగాను, నిర్బలులుగాను చేసిన పురుష స్వార్థ పరత్వానికి సత్తువ కలుగజేస్తున్నావు రేపటి మాట ఆలోచించకుండా పామును పాలోసి పెంచుతున్నావు.

నీవు ప్రేమించవచ్చు. నీతోటి సోదరిని వుసురు పెట్టి నీవాతనిని వివాహమాడడం వుత్తమం గాదు. అధమం! త్యాగమయమైన ప్రేమ నీకుంటే ఆమె సుఖంకోసం అతని బుద్ధి మరల్చాలి. అవసరమైతే ప్రాణ త్యాగానికికూడ జంకగూడదు. అప్పుడు నీది వుత్తమమైన ప్రేమ. అప్పుడు నీవు ఉత్కృష్ట జీవివి అవుతావు.



## — లక్ష్మీబాయి —



శ్రీ జోశ్యుల సూర్యనారాయణమూర్తి

1

భారతభూతభాగ్య పరిభావనకాలపురః పరిస్ఫుర
త్పౌరవదాత్మ వీరసుకథా కథనంబులు, లక్ష్మిబాయి! స
త్కారముగాఁగఁగైకొను ముతావకపావక చిత్రతేజమే
పారినరీతి సంస్కృతియపారపరాక్రమదాయి యౌఁగదా!

2

జననంబందితి వంటబ్రాహ్మణిగ, సత్క్షాత్రంబుఁజూపింపగా
జని, సత్‌క్షత్రియనారి వైతివటగా సాధ్వీమతల్లీ! భవ
జ్జననీ గర్భపవిత్ర శీతలకథా సంస్కారకాత్యద్భుతా
ధునికా భాగ్యవిచిత్ర భారతమిటన్ దుశ్చింత్యమయ్యోజుమీ

3

అబలవెయయ్యు నా సబలసాయుధ సైనికసంహారన్మహా
ప్రబలకృపాణధారణ విభాస్వదశేష మహాద్రణాగ్ర నా
ట్యబహుళీ భంగిమంబు వికటంబుగ లక్ష్మి విదుర్గవై యొన
ర్చి బలవతీత్వ కీర్తిఁగని చిత్రసతీత్రిదివంబునందవే!

4

తురగంబందుననుండి వీఁపునకుఁ బుత్రుంగట్టి హస్తద్వయిన్
కరవాలంబులఁబూని దంతములతోఁగళ్లెంబునుంగట్టిగా
నిరవొందన్ గఱచుంచి నీవొరుల ఖండింపంగ నా దృశ్యమా
దురమందెట్లులనున్న దోగద! మదిన్ దుశ్చింత్యమీనాఁడటుల్



# పతిత తారలు

శ్రీ పి. వి. పేరరాజుగారు

ఉదయం కాఫీ పుచ్చుకున్నప్పటినుంచి ఒదేక దీక్షతో ఆలోచిస్తు కూర్చున్నాను ఆ పద్యం నాల్గవ పాదం ఎలా పూర్తి చేస్తే బాగుంటుందా అని. సిగరెట్టు మీద సిగరెట్టు వెల్గుతూ, ఆరిపోతూ వచ్చాయి. పదాలకు తగిన భావం భావానికి తగిన పదాలు నేననుకున్న పాకంలో తూకంగా రాలే. మరొక సిగరెట్టు ముట్టిస్తున్న సమయంలో రామం వచ్చి మీ కోసం ఎవరో వచ్చారన్నాడు. చాలా వింత మనుష్యులన్నాడు. మానవులా అమరులా అని సందేహంగా ఉందన్నాడు. సరే లోపలికి పంపించమన్నాను.

ఆజానుబాహులైన ఇరువురు సుందరాకారులు లోనికి వచ్చారు. మంచు తెరలవంటి శరీరఛాయ, నవనీత కోమలమైన విశాల నేత్రద్వయం, ఇంద్రధనస్సు ఛాయలు గల రెండు రెక్కలు గల ఆ ఇరువురు పురుషులు మేఘాలలో తేలిపోతున్నట్టు లోన ప్రవేశించారు. ఆశ్చర్య పరవశత్వంలో నోటమాటరాక కూర్చోండని సంజ్ఞచేశాను. వారు సుఖాసీనులైన పిదప కొంచెం తెప్పరిల్లి, 'తామెవరు? ఎందుకు దయచేశారని' ప్రశ్నించాను. గంధర్వులని, నా వల్ల తమకొక ఉపకారం జరగాలని అన్నారు. 'గంధర్వులు! అమరలోక నివాసులైన గంధర్వులకా నేను సహాయం చేయటం' అని నాలో నేను సంస్మరిస్తున్న సమయంలో నా సందేహాని వారు గ్రహించి 'అవును. మీ వల్లనే ఈ మహోపకారం జరగాలి' అంటూ తిరిగి ప్రమాణించారు.

ఒక్క క్షణం ఆగిన పిమ్మట వారితో తిరిగి ఇలా అన్నాను. "నేను నా మిత్రుడు ఒక రోజున ఆ పచ్చని ఆకాశ మైదానంలో..."

"ఆకాశం నీలంగా ఉంటుంది కాదు?" అన్నాను.

"అది మీకు కనిపించే కొద్ది భాగంలోనే. మిగతా ప్రదేశమంతా ఏపుగా పెరిగిన పైరుపచ్చ. ఆ మైదానంలో, గంగోత్రి ప్రాతంనుంచి తెచ్చిన రెండు హిమగిరి శిఖరాలతో మేమిద్దరం బొంగరాలాడు కుంటున్నాం."

"హిమగిరి శిఖరాలా? మరి తాళ్లు?"

"రెండు తోకచుక్కల తోకల్ని ఖండించి తెచ్చుకున్నాం. పోటీ తీవ్రంగ సాగింది కొంత సేపు. మా వాడి బొంగరం గిర్రున తిరుగుతూండగా నేను నా బొంగరంతో ఒక గట్టి దెబ్బ కొట్టే సరికి అది రెండు ప్రక్కలై, ఆ రెండు రివ్వుమని చెరొక వైపుకూ దూసుకుపోయి ఆకాశాన్ని అంటి ఉన్న రెండు నక్షత్రాల మీద పడ్డాయి. ఆ అదురికి పాపం ఆ రెండు నక్షత్రాలు రాలి కిందపడ్డాయి. 'ఆకాశంనుంచే'

"ఆహా! ఈ విషయం ఎలాగో దేవేంద్రుడుకి తెలిసి వాటిని రెండింటినీ వాటి స్థానాలలో చేర్చేవరకు మీరు స్వర్గసీమ చేరకండని శాపించాడు. ఈ పదహారేండ్లు లోకలోకాలు దేశదేశాలు ఎంత వెదకినా వాడి జాడ కనిపించలేదు. మేము విసిగి వేసారి ఇక స్వర్గజీవన ప్రాప్తి లేదని నిస్పృహా చెంది ఉన్న సమయంలో ఒక మహానుభావుడు అవి మీ ఇంటనున్నవని తెలియ జేయగా ఇటువచ్చాం"

"మా ఇంట్లోనా నక్షత్రాలు!"

"అవును. అవి రెండు నీ సతీమణి నేత్రద్వయంగా మారినవట. సామాన్య మానవ స్త్రీకి ప్రకాశమానమైన తారలను నేత్రాలుగా ధరించటం అసమంజసం. మాకు వాటిని తిరిగి ప్రసాదించి మా జీవితం వృథా కాకుండా చూడమని ప్రార్థిస్తున్నాం"

ఈ విపరీత వాక్కులు నాకు మరింత ఆశ్చర్యమయ్యాయి. వెంటనే నా భార్య, లలితాంగిని పిలిచి ఈ ఉదంతం తెలియజేశాను. ఆమె ఒక్క క్షణం ఆలోచించి, నాకు సమ్మతమైతే తానెట్టి త్యాగానికైనా సంసిద్ధురాలినేనని తెలియజేస్తు తన నేత్రాలను పరీక్షించి తమ తారలను వాటి యందు గుర్తించకలిగినట్లయితే వాటిని గ్రహించవచ్చునన్నది. అంతట వారిద్దరు సమీపంగా వచ్చి ఆమె నేత్రాలను శ్రద్ధగా పరిశీలించారు. తమలోతాము రెండు నిమషాలు

సంప్రతించుకున్నారు పిమ్మట “మా తారలు కావివి. ఆ నాడు అంతటి ప్రకాశమానంగానున్నప్పటికి ఈ నేత్రాల ఇంతటి తేజస్సు వాటికి లేనేలేదు” అన్నారు. వెంటనే, శ్రమ కల్గించినందుకు క్షమార్పణ వేడుతూ ఖిన్నవదనులై వెళ్లిపోయారు. వారిని చూస్తే నాకే జాలివేసింది.

లలితాంగి ఫక్కున ఒక నవ్వు నవ్వింది. “వాళ్లని బాగా టోపీ వేశాను కదూ” అంటూ. నాకేమీ అర్థంకాలేదు ఆమె మాటలు. “పాపం వాళ్లు చెప్పింది నిజమే. మా చెప్పింది. నా చిన్నతనంలో ఒక పున్నమినాటి రాత్రి వసారాలో పడుకుని చంద్రునికేసి చూస్తు పడున్న సమయంలో రెండు నక్షత్రాలు హటాత్తుగ ఆకాశంనుంచి రాలిపడి నాకంటా ప్రవేశించాయట. వారు గుర్తిస్తారేమోనని మొదట భయపడ్డాను కాని, మన ఇరువురి ప్రేమ పారవశ్యపు తొలి అనుభవాలను జ్ఞాపకం తెచ్చుకుని ఆ ఆనంద పారవశ్యాన్ని సంస్మరించే సరికి నా నేత్రాలు నూతన రూపంలో నున్న ఆ తారలు ముందెన్నడు ఎరుగని తేజస్సులో ప్రకాశమానమయ్యాయి. అదే వారిని మోసపుచ్చింది.

(ఫ్రెంచి కథననుసరించి)





కాలేజీలో లెక్చరు వింటున్న ! సింహళ స్త్రీలు

చిత్రకారులు : శ్రీ భాగేశ్వర శర్మ

# కస్తూర్బా గ్రామ సేవికా శిక్షణ కేంద్రం

సంయోజకురాలు : శ్రీమతి క్రొత్తపల్లి సరళాదేవిగారు

**21-12-46** తేదీన తాలీమీసంఘ కార్యదర్శి శ్రీ ఆర్యనాయకముగారు సీతానగరమున నడుపబడు చున్న గ్రామసేవికా శిక్షణకేంద్రము, కస్తూర్బా బాలబాలికల పునాది పాఠశాల సందర్శించిన సందర్భమున వారలిచ్చిన ఉపన్యాసం

---

నేను మీ మాతృభాషలో మాట్లాడ జాలనందుకు మీ అందరిని క్షమింపమని ప్రార్థించుచున్నాను. హిందీలోకంటె యింగ్లీషులో బాగా నేను నా అభిప్రాయము వ్యక్తపరచ గలను. కాని, నేను హిందీలోనే మాట్లాడెదను నా మాతృభాష తమిళము. కాని, నేను మాతృదేశమును వదలి ముప్పైయేండ్లనుండి యితర రాష్ట్రములలోనే అనగా, బెంగాల్, మధ్యరాష్ట్రములలోనే పని చేయుచుంటిని. బెంగాల్‌లో శ్రీ రవీంద్రనాథుని ఆధిపత్యమున శాంతినికేతనములో 15 సంవత్సరములు ప్రధానోపాధ్యాయునిగా పని చేసితిని. అప్పుడు తప్పనిసరిగా వంగభాషను యభ్యసించవలసివచ్చినది. తదుపరి 9 సంవత్సరములనుండి శ్రీ బాపూజీ సమక్షమున తాలీమీసంఘమున ప్రాతిపదిక పాఠశాలను నడుపుచున్నాను. ఈ 9 యేండ్లలో మహారాష్ట్రము, హిందీ తప్పనిసరిగా నేర్చుకొనవలసివచ్చింది. యిప్పుడు నేను మీకు చెప్పబోయే విషయములు గ్రామములో బాపూజీ ఆధిపత్యమున జరిగిన కార్యానుభవమును బట్టి, దానిలోని విశేషతను వేరుగా నంత చెప్ప నవసరము లేదనుకుంటాను.

మొదట నేను విదేశాలకు విద్యాభ్యాసమునకు వెళ్లియుంటిని. లండన్ యూనివర్సిటీలో ఎకనామిక్స్ బాగా యధ్యయనము చేసితిని. ఆ విద్యార్థిదశలో యున్నప్పటినుండియే నాకు గొప్ప విశ్వవిద్యాలయము నెలకొల్పి ప్రిన్సిపాల్‌గా పనిచేయవలయునని అభిలాషగా యుండెడిది. అక్కడ విదేశములలోని నడుపబడు ప్రతి చిన్న పాఠశాలను చిన్న పిల్లల విద్యావిధానమును బోధనా పద్ధతులను బాగుగా యధ్యయనము చేసితిని. ఆయా దేశములు బాలుర విద్యావిధానములో చాల యున్నతిపొందియున్నవి కాని, భారత దేశము పై విషయములలో వ్యతిరేకముగా యున్నవి. భారత దేశములో మనము రెండుశాఖలను మిక్కిలి నిర్లక్ష్యముగా వదలియున్నాము. (1) బాలురు, (2) స్త్రీలు.

ఇతర దేశములు ఈ రెండు శాఖలకు గొప్ప ప్రాముఖ్యస్థానము నిచ్చియున్నవి. అందుకనే అవి స్వతంత్రదేశములై యలరారుచున్నవి. ఏ దేశములు ఈ రెండు శాఖలను నిర్లక్ష్యముగా చూచునో అవి బానిసదేశములగుట వేరుగా చెప్ప నక్కరలేదు.

1927 లో విప్లవము బయలుదేరినప్పుడు నేను లండనులో చదువుచుండెడి వాడను. అప్పుడు సుభాస్ బోసు నా సహాధ్యాయి. ఆ మూమెంటు ప్రభావమువల్ల మా ప్రవృత్తులలో యెంత యుత్తేజము కల్గినదన్న అప్పుడే మేమంతా భారత దేశము వెళ్లినను ప్రభుత్వ యుద్యోగములలో ప్రవేశించగూడదని నిశ్చయించుకున్నాము. నేను నాకు శిక్షాకేంద్రమునే కార్యక్షేత్రముగా నిర్ణయించుకొన్నాను. శిక్షాకేంద్రములోను ప్రాథమిక శిక్షగానే అనగా, పునాది శిక్షణమునే నా లక్ష్యముగా నిశ్చయించుకొన్నాను. ఎందుచేతనన మనము యే శిక్షాభవనమును నిర్మింపదలచుకొంటిమో, యది పునాది గట్టిలేకున్న నిలుచునదికాదు. యిప్పుడు మద్రాసు, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, అలహాబాదు, కాశీ మొదలగు నగరములలో విశ్వవిద్యాలయ భవనములు మహోన్నతముగా నిలబడియున్నవి. కాని, వాటికి పునాది దిట్టముకాదని చెప్పవలయును. హిందూదేశము 7 లక్షల గ్రామములు. 7 లక్షల గ్రామములసేవయే దేశసేవయని బాపూజీ చెప్పుతూ యుంటారు.

హిందూదేశములో యెప్పుడు విప్లవము ప్రారంభించినను శిక్షా విభాగమును గవర్నమెంటునుండి మనవశము చేసుకొనుటకే యత్నించితిమి. మొదట్లో మూమెంటు ప్రారంభమై

నప్పుడు అనేకమంది విద్యార్థులు, యుపాధ్యాయులు, కాలేజీలు, హైస్కూళ్లు వదలివేసిరి. అప్పుడే కాశీ విద్యాపీఠము, మొదలగు విద్యాపీఠములు, యనేకములగు ఆశ్రమములు, జాతీయ పాఠశాలలు ప్రారంభింపబడినవి. కాని, ఇవియంత యున్నతస్థితికి రాలేకపోయినవి. కారణము ఆ పాఠశాలల్లో విద్యావిధానములో మార్పు లేకపోవుటయే. జాతీయ పాఠశాలల్లోని పాఠ్యక్రమమునకు అనుకరణముగా యుండెడిది. కేవలము దానిలో కొంచెము రాట్నపరిశ్రమ పెట్టుట, వందే మాతరమ్ స్తవము చేయటయే అప్పటి జాతీయ పాఠశాలల ఆశయము. 1936 లో నూతన మంత్రిమండలి యేర్పడినప్పుడు బాపూజీ మరల విద్యావిధానంలో పూర్తిగా మార్పు చేయాలని తమ ఆదర్శమును వెల్లడించిరి. అప్పుడు గాంధీజీ మంత్రిమండలినంతను పిలిపించి తమ ప్రస్తావన వారియెదుట నుంచిరి. అప్పుడు అనుభవజ్ఞులందరు శిక్షావిభాగములో మూడు మార్పులు తేవలయునని చెప్పిరి. (1) మాతృభాష ద్వారా శిక్షణ గరపుట. (2) వృత్తివిద్య ద్వారా శిక్షణనిచ్చుట. (3) 7 నుండి 14 సంవత్సరములవరకు బాలబాలికలకు నుచితముగా శిక్షణము నిచ్చుట.

మాతృభాషలో బిడ్డలకు విద్యాబోధ జరగనంతవరకు మన సంస్కృతి, సాహిత్యము, సాంప్రదాయము పూర్తిగా అర్థము చేసుకొనునట్లు చేయజాలము.

ఒకసారి కాదు. శ్రీ రవీంద్రులతో రెండుమూడు పర్యాయములు విదేశములలో పర్యటనముచేయు అవకాశము లభించినది. విదేశములలో తిరుగునప్పుడు ఆయా దేశముల పిల్లల విద్యావిధానంమీదనే నా ప్రవృత్తి ప్రసరించుచుండెడిది. అప్పుడు అట్టి సంస్థల నెన్నింటినో సందర్శించి యధ్యయము చేసినాను. పిల్లలకు పరాయిభాషలో విద్యగరుపు దేశము నా కొక్కటియును కనుపించలేదు. పరతంత్ర దేశములకే యట్టి యధోగతి పట్టినది.

నేటికి యెన్నో త్యాగములు, ఎంతోమంది జీవితములు ఆహుతియైన పిదప యెట్టకేలకు శిక్షావిభాగం మన చేతులలోకి వచ్చినది. ఈ సదవకాశమను యుపయోగించుకొని, విద్యా విభాగములో గొప్ప మార్పు తేవలయునని ఒక్క బాపూజీయే గాక మంత్రులందరు గూడ గట్టి పట్టు పట్టిరి. మద్రాస్ విద్యాశాఖవారు కూడ ఈ పునాది శిక్షణనే కార్యరూపములో పెట్టెదమని (అన్ని పాఠశాలలలో) మాట యిచ్చియున్నారు. శ్రీ అవినాశిలింగం శెట్టిగారు థర్డ్‌ఫారమ్ వరకు విద్యార్థులకు అన్ని విషయములు మాతృభాషలోనే బోధించెదమనియు, ఆ పైనికూడ కొంత వివశత్వమువల్లనే యింగ్లీషు యుంచవలసి వచ్చినదిగాని, పై సంవత్సరమునుండి పై తరగతులలో కూడ మాతృభాషనే మాధ్యమంగా తీసుకొనుటకు ప్రయత్నించెదమని చెప్పియున్నారు. మద్రాసు ప్రధాని శ్రీ ప్రకాశంపంతులుగారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో విద్యార్థులకు స్వాతకోపన్యాసము మాతృభాషలో ఇచ్చియున్నారనిన విద్యాశాఖలో అది యెంతటి విప్లవమో వేరే చెప్పనక్కరలేదు. యింకా వృత్తివిద్యద్వారా శిక్షణ యివ్వాలని వర్ధా సమావేశములో తీర్మానింపబడిన రెండవ తీర్మానమై యున్నది గదా! దానిలోనే గ్రామోద్ధరణగూడ యిమిడియున్నది. వృత్తివిద్యలద్వారా శిక్షణనిచ్చుటవల్ల వాటియున్నతితోపాటు ప్రజలలో విజ్ఞానాభివృద్ధిగూడ కలుగునని చెప్పిరి. ఒకప్పుడు మన భారతదేశము ఐశ్వర్యముతో తులతూగుతూయుండెడిది. ఎన్నోసార్లు పరదేశములనుండి దోపిడిగాండ్రు దాడిచేసి మన దేశ ఐశ్వర్యమును దోచుకొనిపోయిరి. దొంగలు, దోపిడిగాళ్లు ఐశ్వర్యవంతుల యిండ్లకే వచ్చెదరుగాని, బీద గుడిసెలమీదకు పోరుగదా! మన భారతదేశముపైబడి పరదేశీయులు అన్నిసార్లు దోచుకొనిరనిన అది మన ఐశ్వర్యము నే తెలుపుచున్నది. ఇతిహాసపుటలు తిరుగవేసిన భారతదేశముయొక్క వస్త్రములు, తదితర భోజనసామగ్రి లండన్‌వరకు గూడ ఎగుమతి జరిగినదినములు కనుపించును. కాని, ప్రస్తుతము మనకు వస్త్రములు, తదితర భోజనసామగ్రి కొరతగాయున్నవి. భారతదేశము శ్రేష్టమైన బియ్యపుపంటకు ప్రసిద్ధి గదా! కాని, యిప్పుడు బర్మా, స్కాట్లండు, సయాం మొదలగు యితర దేశములనుండి దిగుమతు లవవలసినదైన్యం ఏల కల్గినది? అది యే పంటభూమి, ఆ జీవనదులే గదా! ఆ సూర్య భగవానుడే గదా! ప్రకృతిలో యేల మార్పు లేదు? ఇంత మనకు ఈ దరిద్ర మేలబట్టినది? కారణము విద్యావిధానములోని నిర్జీవత్వమే. గ్రామాలనుండి విద్యార్థులు కాలేజీలలో, హైస్కూళ్లలో చదువుకొనుటకు వెళ్లుతున్నారనిన అక్కడ వారికి తల్లిదండ్రుల వృత్తులను మరియు కృషి

వైపుకు గమనించు యవసరమే లేకుండాపోయింది. ఎంత సేపు వారి కార్యక్రమము, పాఠ్యక్రమములోని టెక్స్టు బుక్కులను వల్లెవేయుట, నోట్సు వ్రాయుటయుండె. ఆ తరువాత డిగ్రీలు లభించినవారికి గ్రామములతో పూర్తిగా సంబంధము విడిపోవుననియే చెప్పవచ్చును. పట్టణముల అవసరములన్నియు పల్లెల వుత్పత్తివల్లనే తీరుచున్నది. యిచ్చట వుత్పత్తియైనవస్తువులే పట్టణములకు యెగుమతి యగుచున్నవి గదా! కాని, పల్లెల అభివృద్ధివైపుకు యే మాత్రము అక్కడ విద్యాధికుల దృష్టియే పోదు. అందుకే విద్యావిధానములో మార్పు అతి అవసరము అయినది.

హిందూదేశ మనిన యేదియని మీ వుద్దేశము? మద్రాస్, బొంబాయి, కలకత్తా మొదలగు వేళ్లతో లెక్కింపతగిన పట్టణములా లేక 7 లక్షల గ్రామములా? బాపూజీ పట్టణములన్నియు నిలువునా పోయినాగాని నాకు విచారము లేదు. గాని, ఒక్క గ్రామమైనను చెక్కుచెదిరిన నాకు చాల పరితాపము కలుగుననియు హిందూదేశముయొక్క విశేషము యేదైనా యున్నా అది గ్రామములేననియు, మన యవసరములన్నియు గ్రామములే తీర్చుననియు చెప్పుచుందురు.

సేవాగ్రామములో మేము 9 సంవత్సరముల పూర్వము మొదట ప్రవేశించినప్పుడు అక్కడి బాలురస్థితి చాల హైన్యముగా నున్నది. నూటికి 99 మంది వంటినిండా గుడ్డ, కడుపునిండాతిండిలేని నగ్నరూపములో కనపడెడివారు. కాని, ఈ 9 యేండ్ల మా పరిశ్రమ ఫలితముగా నేడు సేవాగ్రామములోని బాలురు తాము స్వంతముగావడికి నేయించుకొనిన గుడ్డలనే ఒంటినిండా ధరించుకొని కనపడుదురు.

దేశ ఔన్నత్యమునకు బాలుర సర్వాంగ సంపూర్ణతాశయమే పునాది. వారి మెదడు, హృదయము, శరీరము సమానముగా వికసింపవలెనన్న తగుపోషణ యవసరము. నేడు మన గ్రామాలలో బలమగు ఆహారమే లేదు. అందువల్లనే వార్ధా విద్యావిధానంలో వ్యవసాయమును గూడ ముఖ్యవృత్తి చేయుటకు యేర్పాటు చేసితిమి.

వ్యవసాయ కళాశాలలోనికి వెళ్లి అరటి చెట్లు వేయుట టొమోటా మొదలగు కూరగాయలనుపండించుటయే విద్యయను కొంకుము కాని యిండ్లకడ్డ నవ్చుకొనిన ఈ పనులకు విలువ యిచ్చారు.

బాలుర ప్రవృత్తి స్వభావము ఏదో యొక కృషిచేయుటయే. ఏ పనియు లేక స్తబ్దతతో కూర్చొనుట యనునది వృద్ధుల స్వభావము. పిల్లలకు ఆటలే పనులు. పనులే ఆటలు. వాటిలోనే వారి కుతూహలము, జిజ్ఞాస, విజ్ఞానము అభివృద్ధి పొందు యవకాశమున్నది. అమెరికా మొదలగు నితర స్వతంత్ర దేశములలో విజ్ఞులు పిల్లల మనోవృత్తిని బాగుగా నధ్యయనము జేసిరి. అక్కడ పిల్లల విద్యావిధాన మంతయు పనుల ద్వారానే సాగించుచున్నారు. హిందూదేశములో ఆ విధానమును కార్యరూపములో పెట్టవలెనన్న మొదట నెదుర్కొను సమస్య ముఖ్యముగా జాతి భేదములు. బట్టలు నేయుట, కుండలు చేయుట, వడ్రంగము, వ్యవసాయము మొదలగునవి బడులలో పిల్లలకు నేర్పిన యివి మనకేమి యవసరము? ఇవన్నియు ఆయా జాతులవారికే నను కొందురు.

సేవాగ్రామములో 7 మొదలు 14 యేండ్ల వయస్సువరకు శిక్షణపొందిన పిల్లలను ప్రత్తి పండించుట మొదలుకొని వస్త్రములుతయారు చేయునంతవరకు నుండు క్రియలన్నియు చేయగల సమర్థులుగాను స్వావలంబులగాను మీరు చూడగలరు. 14 ఏండ్ల వయస్సు వచ్చునప్పటికి తిండికి బట్టకు స్వావలంబులుగా గల శిక్షణ విజ్ఞానముతోగూడ పరిశ్రమలోను వ్యవసాయములోను కలుగ జేసిన బాలుర జీవితమునకు పునాది పడినదన్న మాటయే కదా. ప్రస్తుతం ఈ విద్యావిధానమునే విద్యా శాఖలన్నియు క్రియాత్మకముగా జేయుటకు పూనుకొన్నవి.

భారతదేశములోని ప్రముఖ విద్యాధికులందరు జనవరి మూడవ తేదీని బొంబాయిలో సమావేశము కాబోవుచున్నారు. ఈ విధానమును అమలులో పెట్టుటకై రెండు వందలకోట్ల రూపాయలు ప్రభుత్వము ఖర్చుచేయ నిర్ణయించినది. ఫిర్కా అభివృద్ధి కార్యక్రమము ప్రారంభింప బోవుచున్నాము గదా! అప్పుడే మీ గ్రామములకు ఈ విధానము రాబోవుచున్నది. ఈ విధానము ఒక దీపము వంటిది. దాని వెల్తురు కొన్ని శాఖల వరకు జాతులవరకే గాక యావత్తు దేశమునకు ప్రసరించుటయే దాని యాశయము కాబట్టి

మీరందరు విద్యావిధానమునకు హృదయ పూర్వకముగా సహకారము యిచ్చెదరని తలచుచున్నాను.

వార్ధా సమావేశములో నిర్ణయింపబడిన మూడవ విషయము 7 నుండి 14 సంవత్సరముల వయస్సు వరకు బాలబాలికలకు నుచితముగానే శిక్షణ యివ్వవలెననుట. దీనికి యోగ్యులగు శిక్షకులు తయారగుట యవసరము అట్టి శిక్షకులను తయారు చేయుటకే మద్రాసు, యింకా యితర ప్రాంతములనుండి ప్రభుత్వము యుపాధ్యాయులను వార్ధా పంపియున్నది.

ఈ కార్యములు ఈ ప్రాంతములో సాఫల్యముగా సాగుటకు యెక్కువ సావకాశముగలదు. యిచ్చట అనుభవజ్ఞులగు కార్యకర్తలున్నారు. గాంధీగారు యిక్కడకు రెండు మూడు పర్యాయములు వచ్చియుండిరి. మొదటనుండి నిర్మాణ కార్యక్రమమునకు ఈ జిల్లా కేంద్రముగా యున్నది. అదృష్టమువల్ల కస్తూరిబా కార్యముకూడ ప్రథమమున యిక్కడనే ప్రారంభింపబడినది. నేను యిక్కడ జరుగుచున్న కార్యక్రమమును బాగుగా పరిశీలించితిని. ఈ ఆరు మాసముల కొద్ది అవధిలోనే యిక్కడ శిక్షణ పొందు బాలబాలికలలో చాల యుత్సాహము అభివృద్ధి కనబడుచున్నది. ఈ విధముగ పని జరిగిన కొద్ది రోజులలోనే ఈ గ్రామములో చాల యభివృద్ధి కలుగ గలదని యిక్కడి కార్యక్రమమునకు పౌరులందరు సహకారము చూపి తోడ్పడెదరని ఆశించుచున్నాను.

తరువాత అధ్యక్షులు యుపన్యాసకులను, కార్యకర్తలను ప్రశంసించుచు పునాదీ శిక్షణను గురించి కొంత ముచ్చటించిరి. తదుపరి గ్రామ సేవికా శిక్షణకేంద్ర ప్రిన్సిపాల్ శ్రీ డి. యస్. విద్యాదేవిగారు అధ్యక్షులకు యుపన్యాసకులకు సభికులకు తమ ధన్యవాదము లర్పించుచు తమకు ఈ కార్యక్షేత్రములో కలిగిన అనుభవములను వ్యక్తపరచుచూ, దీనిలో యెదుర్కొను సమస్యలను విశదపరచుచూ గ్రామ వాసుల యొక్క యుపాధ్యాయుల యొక్కయు సహకారము నూతన విద్యావిధానముపు ప్రయోగమునకు యెంత అవసరమో వివరించిరి. తదుపరి ఆశ్రమ వాసుల సాయంకాల ప్రార్థనతో సభ ముగిసినది.





## మా గాంధీ!



### శ్రీమతి పి. సూర్యకాంతం

విన్నారా ?
మను పెవ్వరైన మావిచిత్రకథనూ
విన్నారా ?

ఖండాంతరపు జనులారా ?
మహాప్రపంచపు ప్రజలారా ? ॥ విన్నారా ? ॥

తాతలనాటి పాతపాతమీ చరిత్రలన్నీ తీయండి
యీ విచిత్రకథ మీరెన్నడైనను విన్నారేమో చెప్పండి
॥ విన్నారా ॥

మారణహోమపు మరఫిరంగులకు
ప్రచండజ్వాలా యాటం బాంబుకు
అహింస చరఖాలను శస్త్రంబుల
నెదుర్కొన్నవారున్నారేమో ॥ విన్నారా ॥

సర్వమతంబులు సర్వమానవులు
ఏకముఖంబున నడుచుటకొఱకై
అహింససత్యంబను సూత్రంబుల
చెప్పిందెవరో విన్నారా ? ॥ విన్నారా ॥

విశ్వమానవ హృదంతరాలకు
దాస్యపుశృంఖలు లేనేలేవని
దిగంతములకు చాటిందెవరో
యుగాంతములకు నాటిందెవరో ॥ విన్నారా ॥

నిరశనవ్రతముల నల్పిందెవరో
స్వేచ్ఛసందేశము చెప్పిందెవరో
శాంతిసమరమును నడిపిందెవరో
బోసినోటి మా గాంధీ యెవరో ॥ విన్నారా ॥



# నిరుత్సాహపడకు

శ్రీమతి బి. స్వరాజ్యం

“ సాయంత్రం మూడుగంటల సమయం. కల్పనాదత్తు ఆత్మ కథ చదువుతూ కూర్చున్నా ” ..యింతలోనే మా చెల్లె... “ అక్కయ్యా, విమలమ్మ వచ్చిందని గభాలున పరుగెత్తుక వచ్చింది ”. కాని, నేను నమ్మలేకపోయా; “ విమల నాకు పూర్వస్నేహితురాలు. ఎప్పుడో కాపరానికి వెళ్లకముందు, మే మిద్దరం అన్యోన్యంగా వుండేవాళ్లం. ఆమె ఒక ధనికయింటి కోడలు. కాపరానికి వెళ్లి రెండు సంవత్సరాలనుంచీ కన్పించలే ... పాపం చూడాలనిపించిందేమో వచ్చిందనుకొన్నా. నాకు చాలా సంతోష మనిపించింది......

యేం విమలా ? బాగున్నావా ? అన్నా. తానుకూడా చాలా రోజులకు తన ప్రియమైన స్నేహితురాల్ని కలుసుకున్నానని కాబోలు, చేతికిచేయి అందించింది. కానీ ఆమె ముఖాన సంతోషం వెల్లివిరిసింది...“ యేమిటి విమలా ? క్షేమ సమాచారాలు. అమ్మావాళ్లూ బాగా వున్నారా ? ” అని అడిగా.

“ అమ్మావాళ్ల క్షేమం నా కెందుకు. యీ భాగ్యజీవిని నేను మాత్రం బ్రతికేవున్నా ” అంది విమల.

ఆమె కళావిహీనమగు మొఖము. ఆమె జీవితంపై విసుగెత్తి మాట్లాడే మాటలు. దీనమైన కంఠస్వరం చూచి నాకు చాలా జాలివేసింది. బాధనిపించిందికూడా; ఈమె బాధేమిటో తెలుసుకోవాలనుకొన్నా. చేయిపట్టుకొని మాట్లాడుతూ యింట్లో కొచ్చాము. “ అమ్మా, నా స్నేహితురాలు విమల వచ్చిందే ” అన్నా.

“ కూర్చో బిడ్డా ” అని పీటేసె గౌరవించింది అమ్మ.

“ విమలమ్మక్కయ్యకు ఫలహారము చేసి పెడదామే అంది ” చెల్లె.

“మన కేముంది బిడ్డా. మనం బీదవాళ్లం. ఆమె ధనికయింటి కోడలు. మంచి మంచి ఫలహారములు మనకు లేవు కదా ” అంది అమ్మ.

“ దోచుకతినేవాళ్లకు దొడ్డదొడ్డ ఫలహారాలు. అటువంటి వాళ్లుండగా, మనలాంటి బీదవాళ్లకు బ్రతుకువేర వుందా ? ప్రజల నెన్నికష్టాలు పెట్టుటలే దీ దుండగీంద్రు ” ఏదో వున్నది పెడదామన్నా.

“ మళ్లీ విమలకు కోపమొస్తుందేమో నని మొఖముకేసి చూశా. కాని, విమలముఖంలో ఏ మాత్రం మార్పు కనిపించలే...విచారంగా చూస్తూ నిలుచుంది.

“ ఎందుకు రాధా ఆలా అంటావూ ” అంది అమ్మ.

“ ఏంది మామ్మా. ఆ విధంగా అనకు. నిజంగా ధనికులు నికృష్టులు, కఠినులు, కనికరమనేది యే కోశానా వుండదు. ఎంతటి నీచానికైనా వెరవరు. ప్రజల్ని అతిఘోరంగా దోచుకొంటారు......

“ నిజం రాధా. నిజం చెప్పావు ” అంది విమల.

“ నా కాశ్చర్య మనిపించింది. అసలు సంగతేమిటో తెలుసుకోవాలనే పట్టుదల కలిగింది విమలను సంతోష పెట్టాలని ”

“ స్వాతంత్ర్యము స్వేచ్ఛయు కాంతీ,
యీ జగతి లేదా స్త్రీలకూ. ”

అనే పాటపాడాను, “ విమల చటుక్కున నా ముఖం

సంబంధాలు సమానస్థాయిలో లేకుంటే వచ్చే అనర్థాలు

వైపు చూస్తూ" నిజమే రాధా. యీ సమాజంలో నా కేదైన దారిచూపవూ అంది.

"విమలా! ఎందుకమ్మా నీ కింత బాధ?

"నా తలిదండ్రులు దరిద్రులైనా, నన్ను ధనికుల కిచ్చి గొంతుకోశారు."

ఆల్లా అంటావు విమలా? "తల్లిదండ్రులు దరిద్రులైనా ధనికుని యింట్లో పడ్డదని, సుఖపడుతుందని, అదృష్టమని, సమాజంలో మన అమ్మలంతా ముచ్చటలాడుకుంటుంటే, ఒకొక్కప్పుడు మా అమ్మకూడా నా బిడ్డకు సుఖములేదాయె నని చింతించుతుంది. కాని, మేము దాన్ని సహించం; "వ్యతిరేకించుతాం. వాళ్లేవిధంగా దుర్మార్గాలు చేస్తారో, మా అమ్మకే కాకుండా స్త్రీ లందరికీ నచ్చచెపుతాం."

ఈ సమాజమా, పాడు సమాజం? "యింకెన్ని తరాల నీ విధంగా నాశనంచేయ దలచుకుందో, ఎన్ని అనుభవాలను గడించినా, యీ సమాజాని కెందుకు బుద్ధిరాదో" "ఈ సనాతనిష్టులు బుద్ధిపూర్వకంగా బాలికల గొంతులు కోస్తారు."

"నా జీవితం చూడు రాధా. యే విధంగా పాడై పోయిందో? "యింట్లో అత్త సెగలనివ్వదు. ఆడబిడ్డ అంతకంటె భష్టులి. దాసీదానికంటే నీచంగా చూస్తారు. గౌరవమనేది పాడైపోయింది. యిక భర్త సంగతి చూచు కుంటే భావి జీవితమే లేదనిపిస్తుంది. నన్ను మూడవ సంబంధ మిచ్చారు. నా కేమాత్రం యిష్టం లేకుండే కాని, యీ సమాజం నా భావాలను చెప్పకోకుండా నోటికి తాళం వేసింది. దురాగతాలకు లోనై మా తల్లిదండ్రులు నన్ని బాధ లకు గురిచేశారు. బీద కుటుంబంనుంచి వచ్చానని, అత్తా, ఆడబిడ్డా యెత్తిపొడుస్తారు. భోగం మేళాలతో కాలం గడు పుతుంటా డతడు. యిక నా మాట తలచేవారెవరా కుటుం బాన? అబ్బా భరించరాని బాధలు. ఏం చెప్పను? యేమి తోచదు. ఆత్మహత్యే అంతిమమార్గ మనిపించుతుంది."ఇవన్నీ వినేసరికి నా హృదయం బరువెక్కిపోయింది అబ్బా యీ సమాజంలో యెంత కుళ్లువుంది? "యిటువంటి అభాగ్య జీవులు యెందరు మానవత్వాన్నే చంపుకొని సమాజ కట్టు బాట్లకు లోనై, బాధ లనుభవిస్తున్నారు." దీనికి మార్గ మేదైనా వుందా? అనే ఆలోచనలో పడ్డా. యేదైనా... విమలను వోదార్చడమే ప్రస్తుత కర్తవ్యమనుకున్నా. విమలా మా తోటవద్దకు పోదాము; పద అన్నా.

"నా మాట వినగానే సంతోషిస్తూ నా ముఖంకేసి చూడసాగింది." యేమిటా? అనే ఆలోచనలో పడ్డా. యింతలోకే అమ్మ గ్రహించింది. "యేంటే రాధా? ఆమె ధనికయింటి కోడలు గదా, ఘోషాను వదలుకొని తోటకు రావడం అగౌరవం కాదా?" అంది.

యిది వినగానే ఎంతో వుద్రేకంతో నాకు పెద్ద వుప న్యాసం వొచ్చింది. "ఏంటే అమ్మా? యింకెన్నాళ్లు నాలుగు గోడలమధ్య బంధించబడి కప్పవలె పరదాలచాటునే పాలి పొమ్మంటున్నావు? మీకు మల్లేనే దుష్టాచారాల కట్టు బాట్లతో ప్రకృతి సౌందర్యాన్నికూడా చూడ వీలులేకుండా వుండడం గౌరవమేనా?"

"ప్రజలను దోపిడిచేసే యీ ధనిక కుటుంబాలకు గౌరవ గౌరవాలు, న్యాయాన్యాలు అర్థంకావు; చెవికెక్కవు. ముక్కుపచ్చ లారని పసిబిడ్డలను వివాహమాడి, అనుమానా లతో ఘోషాపద్ధతి పెట్టి, తమచేతిలో దిష్టిబొమ్మల్లాగా, తయారుచేసుకోవడానికి, స్త్రీలు చదువకూడదని నిషేధాలు సృష్టించి, స్త్రీలను నిర్జీవులుగా తయారు చేశారు. యీ మోసాన్నెరుగక వీరినే గౌరవనీయులుగా భావించుకొనే అమాయక బీదకుటుంబాలు పై ఆచారాలననుసరించి, నానా విధాల అవస్థలుపడ్డారు. నిజంగా ఆలోచించితే యిది గౌరవ మనబడదు; ప్రతి స్త్రీ, పురుషుని మనస్సులను వికసింపజేసి, హృదయాలకు స్వేచ్ఛనిచ్చి దోపిడిచేసే పద్ధతిపోయి, అంద రిని సమానంగా విజ్ఞానవంతులను చేయడమే గౌరవము; ఆదర్శము."

అమ్మా? యికనైనా యీ మోసాన్ని గ్రహించడం మంచిది.

యిదంతా విన్న విమలకండ్లు జ్యోతులై మెరిసాయి. ఆవేశంతో మొఖము ఎర్రనైంది. ఆలోచనతో రాధా? యింతవిజ్ఞానాన్నేలా సంపాదించావమ్మా? నేను, నీవు ఒక్క బళ్లో చదువుకున్నాము కదా...అంది.

## నిరుత్సాహపడకు

విమలా ? స్కూల్లో చదువుకున్న విజ్ఞానము కాదమ్మా. "మన స్కూళ్లల్లో సరియైనవిజ్ఞానం బోధించరు. అందులో స్త్రీలను మరీ తక్కువగా చూస్తారు. మన కీలాంటి విజ్ఞానం బోధించరు. యేదో పిట్టకధలు చెప్పి, కాలం వెళ్లబుచ్చుతారు."

"మరేలా సాధించావు రాధా ? నీతో స్నేహంగావుండటానిక్కూడా వీలులేకుండా చేశారు నా తల్లిదండ్రులు. ప్రపంచంతో సంబంధం లేకుండా నా కాళ్లు కట్టివేశారు. యీ బాధ లెన్నటికైనాపోతవా ? మార్గమేదైనా వుందా ?"

"విమలా భయపడకు; నీవేకాదు యీ బాధ లనుభవించేది. యింకెందరో వున్నారు. యీ సమాజంలో మార్పు రానంతవరకు యీ బాధలు పోవు. మార్గము లేకపోలేదు, ఉంది ఆలోచిస్తే, ధైర్యంచేస్తే మార్గం లేకపోలేదు. మన కొక సంఘముంది. మనవలె బాధ లనుభవించినవారే మంచి మార్గ మాలోచించి, సమాజ మార్పులకొరకు పాటుబడుతున్నారు. నన్నా సంఘమే అభివృద్ధి చేసింది. మనంకూడా శక్తివంచన లేకుండా పాటుపడాలి. ముందుముం దొచ్చే భావిపౌరులైనా, సుఖజీవనం గడిపేలా చూడాలి."

"నిజమే రాధా; ముందొచ్చేవాళ్లకైనా యీ బాధలు లేకుండాపోతే బాగుండుననిపిస్తుంది" రాధా; నీవు నాకు చాలా సహాయపడాలి. నన్నుకూడా స్త్రీలహక్కుల కొరకు పాటుపడేలా చేయాలి.

"ఫరవాలేదు విమలా; అవకాశ మున్నంతవరకు సహాయపడుతా. అందుకేమీ సందేహంలేదు." "నిరుత్సాహపడకు".



ఆఫ్రికానుండి

# కుష్టు ★ బొల్లి

ఫిజీవరకు

## గ్యారంటీ చికిత్స!

## వాడబడుచున్నవి మా ఔషధరాజములే!

### ఋతుశూల నివారిణి

ఋతుకాలమున స్త్రీలకు గల్గు యెట్టి విపరీతమగు శూలనొప్పులనైనను మూడు రోజులలో తగ్గించును. ఎంతకాలమునుంచియున్నను, వెంటనే తగ్గును. ఋతుదినములు మూడింటనే వాడునది. ఋతుశూలనియ్యది మంత్రించినట్లు బోగొట్టును.

కవిభూషణ, శ్రీ ఆనందచంద్ర మిశ్రా, బి ఎ.,సి.టి

బి హెచ్. స్కూల్. నయాగఢ్.
నయాగఢ్ సంస్థానం, పూరీజిల్లా, 1944 మే 20

మహాశయా :

కుష్టుకు మీ ప్రఖ్యాత ఔషధాలను తెప్పించి వాడుతున్న తరవాత రోగికి గుణం కనిపించిందని మీకు తెలియచెయ్యడానికి చాలా సంతోషిస్తున్నాను మీ చికిత్సకు పూర్వం ఎన్ని ఇంజక్షన్లు ఇప్పించినా రోగిని, బాధపెట్టడం తప్ప గుణం ఏమీ కనిపించలేదు

మీ ఫస్ట్‌క్లాస్ డబ్లియు, యల్ సి ని మొదట సేవించన దానికే అతడిలో ఆశ్చర్యకరమైన మార్పులువచ్చి. మీ చికిత్సను ఇంకా పొందవచ్చని విశ్వాసంకలిగింది అతడు ఇప్పుడు కులాసాగా వున్నాడు. యిల్లు నిలబెట్టి, సౌఖ్యం చేకూర్చినందుకు అతడి ధన్యవాదాలను మీకు అర్పిస్తున్నాడు. మీ ఫస్ట్‌క్లాస్ చికిత్స చాలా ఖరీదైనప్పటికీ అమోఘంగా పనిచేసింది.

కుష్టుతో బాధపడుతున్నవారి ఉపయోగార్థం, ఈ నాలేఖను వినియోగపరుచుకోడానికి అంగీకరిస్తున్నాను ప్రపంచంలోవున్న ఇతరఔషధాలకంటె మీ ఔషధాలనేవారు వాడితే మంచిదని నా సలహా,

మీ విశ్వాసపాత్రుడు,

ఆనందచంద్ర మిశ్రా.

### సువర్ణ గంధక పుష్పం

స్త్రీలకు గలుగు ఋతుదోషములు అనగా ఋతుస్రావము (తెలుపు, ఎరుపు, నలుపు) రంగుమారుట—దుర్వాసన గలిగియుండుట—అసలు బహిష్టియే గాకుండుట—మొదలగు సర్వ స్త్రీ ఋతుదోషములను పోగొట్టి, క్రమ ఋతువును గలిగించును. గొడ్రాండ్రు వాడిన సంతానవంతులగుదురు.

కొత్తగా అచ్చువేయబడిన మా పెద్ద తెలుగు క్యాటలాగు, 10 భాషలలో కేటలాగులు, యోగ్యతా పత్రములు

## ఉచితము!

బ్రాంచ్ ఆఫీసులు :

బెజవాడ
గాంధినగర్.
★
అత్తిలి
బస్ రోడ్.
★

# రెడ్డి & కో.,
(రిజిష్టర్డ్)
## H. O.
## గోపాలపురం,
## తణుకు, తూ. గోదావరి

బ్రాంచ్ ఆఫీసులు :

సికింద్రాబాద్
3560, కింగ్స్ వే.
★
వాల్తేరు
R. S. పోష్టు
★
కటక్
బక్సి బజార్.

# విడాకుల చట్టము

చర్చలో పాల్గొన్నవారు : శ్రీమతి రమాబాయి, సుశీల, కల్పకం, రత్తమ్మ

అధ్యక్షురాలు : శ్రీమతి బెన్నూరి కృష్ణవేణమ్మగారు

ఆంధ్రమహిళాసభ హిందీవాగ్వర్ధినీశాఖ 27 వ సమావేశం శ్రీమతి బెన్నూరి కృష్ణవేణమ్మగారి అధ్యక్షతను జరిగింది. గత సమావేశపు నివేదికను చదివేక " విడాకుల చట్టం భారతీయ సమాజానికి హానికరమైన " దన్న నాటి చర్చావిషయం ప్రస్తావించబడింది.

శ్రీమతి ఆర్. రమాబాయిగారు :—భారతీయ సమాజంలో వివాహానికి పారలౌకిక మహత్వ మెక్కువ యివ్వ బడివుంది. ప్రేమ ద్వారా భగవంతుని పొందుటయే హిందువుల జీవిత లక్ష్యం. వివాహం ఈ ప్రేమ మార్గాని కొక మెట్టు. దృఢమైన ప్రేమ ద్వారానే భగవంతుని పొందగలం. కాబట్టి కొంత భిన్నాభిప్రాయాలుండటం చేత భార్య, భర్తలు విడిపోయినట్లైతే వారి జీవనాల వున్నత లక్ష్యం సిద్ధింప నేరదు. ఇంకో విషయం. 2, 3 వివాహాలు చేసుకొన్నవారి సంతానం యెక్కువ బలవంతులుగా నుండరని ఉపపాదించారు.

శ్రీమతి టి. సుశీలగారు :—విశాలమైన విచక్షణ, అనుభవాల ననుసరించియే భారతీయ సమాజంలో యెన్నో ఆచారాలు సంస్కారాలు సృజింపబడ్డాయి. మన సమాజంలో ఈ విడాకుల చట్టం యెప్పుడూ లేదు. అందుచేతే ప్రపంచమండలి అన్ని దేశాలలోను భారత నారీమణుల కెంతో గౌరవం లభించింది. ఇంతే కాదు. పాశ్చాత్య దేశాలలో, ఈ విడాకుల చట్టాన్ని చాలవరకు దుర్వినియోగించేశారు కూడాను. ఈ చట్టం అమలులోనికి వచ్చినట్లైతే సమాజంలో చాల వుచ్ఛృంఖలత ప్రాకిపోతుంది. విడాకులిచ్చుకున్నట్టయితే, స్త్రీ, పురుషుల వ్యక్తిత్వాలు బాగుపడటానికి అవకాశాలుండవు " అని ఉపపాదనను బలపరచేరు.

శ్రీమతి కల్పకంగారు :—ఇదివరకు మన సమాజంలో విడాకుల చట్టం లేదన్న మాట నిజమే. కాని, మునుపటి రోజుల్లో స్త్రీలపైన యిటువంటి అత్యాచారాలు జరిగేవి కావు. భార్యా, భర్తల మధ్య స్నేహం, సానుభూతి వుండేవి. కాని, ఈ రోజుల్లో శోచనీయమైన యెన్నో ఘట్టనలు సంభవిస్తున్నాయి. భార్య రూపవతి, విద్యావతి కాదన్న కారణాలపై ఆమెను త్యజించే పురుషుల సంఖ్య ఈ నాడు యెక్కువగానే వుంది. ఆమెను వదలిపెట్టి, తిరిగి భర్త వివాహమాడినట్టయితే, అదే యింటిలో వుంటున్నటువంటి మొదటి భార్య కెంత బాధ కలుగుతుంది ? ఇటువంటి పరిస్థితుల్లో విడాకుల చట్టమామెకు వరతుల్య "మని వుపపాదనను ఖండించారు.

## భారతీయ సమాజానికి హానికరమైనది

## విడాకుల చట్టము

శ్రీమతి రత్నమ్మగారు :—వివాహ సంస్కారం చాల పవిత్రమైనది. దానిపైనే వ్యక్తి, సమాజం, దేశం యొక్క వున్నతి ఆధారపడి వుంది. భర్త వ్యభిచారి, వ్యాధిగ్రస్తుడైతే, ఆ కుటుంబానికి చాల దుఃఖము నష్టం కలుగుతుంది. కొన్ని కొన్ని సాంసారిక (పైన పేర్కొన్నటువంటి) కష్టాలు భరింపరానివిగా వుంటాయి. ఈ పరిస్థితుల్లో విడాకుల చట్టం సాయపడుతుంది. అక్కడక్కడ విడాకుల చట్టం యొక్క దురుపయోగం జరిగిందన్న మాట నిజమే. అలా కాకుండ చూసుకోవటం ప్రతీ వ్యక్తి యొక్క కర్తవ్యమని ఖండనను బలపరచేరు.

సభికుల ఓటు తీసుకోగా అధిక సంఖ్యాకులు సమర్థన పక్షమున ఓటు చేసేరు.

అధ్యక్షురాలగు శ్రీమతి బె. కృష్ణవేణమ్మగారు — విడాకుల చట్టం భారతీయ సమాజానికి బొత్తిగా హానికరమైంది. దీనివల్ల హిందూ స్త్రీల కిదివరకు లభించిన గౌరవం నశించిపోతుంది. వివాహం ఐహిక సుఖాల ననుభవించేందుకొక సాధనం కాదు. పశువు, మనుష్యునిలో భేదం వున్నట్టయితే ఈ విడాకుల ప్రశ్న వుండనే వుండదు. అనేక కష్టాల ననుభవించినప్పటికీ, ఓర్పు, సేవాభావాలతో యితరుల ఆత్మపై విజయం పొందడంలోనేవుంది మనుష్యుని యొక్క మనుష్యత్వమూ, మహిమా" అని వక్కాణించారు.

అభివందనాలతో నాటి సభ ముగిసింది.

టి. సుశీల,
కార్యదర్శిని.





# గాంధీజీ ఏమంటారు

ఈ రోజుల్లో పిల్లలు మాడిపోతున్నారు. వారికోసరం నేను భిక్షమెత్తుతున్నాను. వారితో మాకు సంబంధం లేదనడం గాదు. ఉందనుకుని చెప్పుకొనేందుకు గర్వపడాలి. మిగతా ప్రాంతాల్లో సోదరీమణులు గావించినట్లే మీరుకూడా మీ డబ్బే గాక, నగలుకూడా దానంచేయాలి. బరువుగా అలంకరించుకున్న సోదరీమణుల్ని జూచినప్పుడు నా ఆకలికళ్లు వారి నగలమీద పడతాయి. ఈ అడగడంలో ఒక అంతరార్థం కూడా యుంది: స్త్రీలకు నగలు - నాణ్యాల మీది వ్యామోహం తగ్గించడాని కిది తోడ్పడుతుంది. మిగతా సోదరీమణులకడ నేను తీసుకునే చనువే మీ దగ్గరకూడా తీసుకుని అడుగుతున్నాను: పురుషులకంటె స్త్రీలను నగలనలంకరింప జేసుకొనజేసే దేమిటి? నాకు నేస్తలైన సోదరీమణులు కొందరు చెప్పారు - 'స్త్రీలు నగల నలంకరించుకోవడం పురుషుల కానందం కలిగించడంకోసరమే' నని. మంచిదే గాని, నా సలహా యేమిటంటే, లోక వ్యవహారాల్లో మీ కర్తవ్యం మీరు నిర్వర్తించాలంటే, మగవారి ఆనందం కోసరమని మీరు సింగారించుకోవడానికి అంగీకరించరాదనీ. నేను స్త్రీనై పుట్టియుంటే, స్త్రీలు తమకు ఆటవస్తువు లనుకొనే పురుషుల నటన మీద ఎదురు తిరుగుదును. స్త్రీల హృదయాల్ని ఆకర్షించుకొనే నిమిత్తం నేను మానసికంగా స్త్రీనయ్యేను. నేను నా భార్య నిదివరలో చూచే మాదిరిగా 'ఆమె భర్తగా ఆమెపై నా కేవో హక్కు లున్నాయన్న తలంపులు వదలుకుంటే గాని, నా భార్య హృదయం నేను ఆకర్షించుకోలేను.' ఈ రోజున చూడండి, ఆమె నాలాగే నిరాడంబరిగా యుంది; నెక్లేసులు, అలంకార వస్తువులు ఆమెకడ లేవు. మీరు అలాగే ఉండాలని నా కోరిక. మీ పిచ్చిలు వ్యామోహాలకు గాని, మగవారికిగాని మీరు దాసులై యుండడానికి అంగీకరించకండి. అనవసర నగలు అలంకరించుకోవడం మానండి. అత్తర్లకు, లావెండర్లకు ప్రాకులాడకండి. మీరు సువాసన వెదజల్లాలంటే, అది మీ హృదయంనుంచి రావాలి. అప్పుడు మీరు మగవార్నేగాదు, మానవజాతిని బంధించగలరు. ఇది మీ జన్మహక్కు. పురుషుడు స్త్రీనుంచి పుట్టాడు. అతడామె మాంసంలో మాంసం, ఎముకలో ఎముకాను. మీ ఆధిక్యతను మీరు గమనించి, మీ సందేశాన్ని మళ్లీ అందజేయండి.

కార్మిక స్త్రీలు ఎలాంటి శోచనీయ పరిస్థితుల్లో జీవిస్తున్నారో మీకు తెలునా? వార్ని మీ సోదరీమణుల్లాగ భావించండి. వారి మధ్యకు వెళ్లండి, మీ కున్న మంచి ఆరోగ్య జ్ఞానం, సామర్థ్యాలు వినియోగించి వారికి సేవ గావించండి. వారికి సేవగావించడంలోనే మీ గొప్ప

ఉండేటట్లు ప్రవర్తించండి. ఇంకా మీ ఇళ్లలోనే గావించే సేవ లేదా? పురుషుల్లోనే సంఘానికి పీడవలె దుష్టులున్నారు, త్రాగుబోతులున్నారు. వారిని, వారి దుష్టత్వాన్నుంచి విముక్తుల్ని జేయండి. సాల్వేషన్ ఆర్మీ గరల్సులాగ దొంగలు, జూదగాళ్లు, త్రాగుబోతుల గుహల్లో ప్రవేశించి, వారి కాళ్ళూ, కడుపూ పట్టుకుని వారిలో పరివర్తన తెచ్చేలాగున, మీరుకూడా నిర్భయంగా కృషిచేయండి మీరు సింగారించుకున్న అలంకారాలకంటె, ఆ సేవ మీకు గొప్ప అలంకారమౌతుంది. అనవసరనగలకు వెచ్చించక మీరు వెనుకవేసిన ధనానికి నేను ట్రస్టీగానుండి, బీద సోదరలకు సర్దుతాను. ఈ నా హృదయాంతరాళాల్ని పెకలించుకుని వచ్చే ప్రబోధ సందేశాలు మీ అంతరాళాల్లో నాటుకుపోవాలని ప్రార్థిస్తున్నాను.

* * *

నేను స్త్రీల ఆభరణాలకై గావించిన అప్పీలు, విరాళాలుగా వచ్చినవాటిని వేలంవేస్తున్న పద్ధతుల్ని విమర్శిస్తూ ఒక వార్తాపత్రిక వ్రాసిన పేరా నా కంటబడింది. నా మీటింగులకు హాజరయ్యే వేలకొలది యుండే సోదరీమణులు తమ ఆభరణాలనన్నిటినీ గాకున్నా, వీలైనంతవరకు యివ్వాలనే నా కోరిక. కోట్లకొద్దీ ప్రజలు అర్ధాకలితో అడలుతున్నట్టిన్నీ, జనాభాలో నూటికి 80 మంది యదార్థంగా కడుపునిండా కూడులేక కుములుతున్నట్టిన్నీ యీ దేశంలో ఆభరణాల్ని ధరించడం చూచేవారి కళ్లకు ఆవేదన కలిగిస్తుంది. హిందూ దేశంలో స్త్రీలకు తనదని చెప్పుకోదగ్గ డబ్బు వారిదగ్గర ఉండదు. కాని, వారు ధరించే నగలు తప్పకుండా వారివే. అయినా తన ప్రభువు(భర్త) యొక్క అనుమతి లేనిదే యివ్వరు, యివ్వసాహసించలేరు. అదిగాక ఈ ఆభరణాలు అనేకమైన వాటిల్లో కళయనేది కనబడదు! కొన్ని నిర్ధారణగా అసహ్యంగా నుండేవి, దుమ్ముధూళికి ఆశ్రయమిచ్చేవిగా యున్నాయి: కడియాలు, బరువైన నెక్లేసులు, (జుట్టును సర్దడానికి గాను దువ్వుకోని, తలంటు పోసుకోని, తరుచు చెడుకంపు కొట్టే జుట్టుకు అలంకారంగా నుండడానికి ఉపయోగించే) సిగల్లోని రాగిడీలు, మోచేతినుంచి రిష్టువరకు వరుసలపై వరుసలుగా పేర్చే బంగారు గాజులు వగైరాలు. నా అభిప్రాయంలో విస్తారఖరీదైన నగల్ని ధరించడం దేశానికి నిస్సందేహంగా నష్టకరమని. వాటిల్లో అంతేసి డబ్బు బంధింపబడిపోయి యుంటుంది. అంతేగాక అరిగిపోడానికి విడవబడుతూ యుటుంది. ఇలాంటి ఆత్మశుద్ధికాలంలో, పురుషులు - స్త్రీలు నగల్ని యిచ్చివేయడం సంఘానికి నిశ్చయమైన లాభమౌతుంది. అలా విరాళంగా యిచ్చేసిన నగలాంటిని మళ్లీ చేయించరాదు. యదార్థంగా చెపుతున్నాను—తమను బానిసలుగా జేసినవాటినుండి విముక్తుల్ని గావించడానికి ప్రోత్సాహించినందుకు—స్త్రీలు నన్ను దీవించారు. అదిగాక, తమ గృహాల్లోకి నిరాడంబరతను ప్రవేశపెట్టినందుకు—చాల కేసుల్లో పురుషులు నాకు ధన్యవాదా లర్పించారు.



# భారతదేశం - కార్మిక స్త్రీలు


మూలం :
పద్మిని





అనువాదం :
పి. యస్. కాంతం


మనదేశంలో భగభగమండుతూవున్న రోడ్ల మీద బిడ్డల్ని వీపులకు కట్టుకుని అన్నపు మూటలను నెత్తినిడుకొని సొక్కుతూ సోలుతూ వెళ్ళే స్త్రీలను సాధారణంగా మనం చూస్తూవుంటాం. ఏ క్వారీలకో పోతూవుంటారు. గమ్యస్థానం చేరి కాలే కాలే గులకరాళ్ళ గుట్టలమీద ఆ రోజుల్లా మకాం వేస్తారు. చెట్టుకో చామకో గుడ్డ వుయ్యాలు వేసి బిడ్డల్ని అందుంచి, రోజల్లా సుత్తులతో రాళ్లుపగలగొడుతూవుండాలి. రాళ్ళ నలుసులు ఎగిరి వచ్చి కళ్ళల్లో పడుతూంటాయి. దుమ్మంతా నెత్తిని పడి, తల ముగ్గుబుట్టగామారుతుంది. చెమట ధారలు నిలువెల్లా పడుతూ వుంటాయి. మధ్యాహ్నం కాస్త చల్దిముద్దవో మిరపకాయతోనో, వుల్లిపాయతోనో వేసికొని సాయం సంధ్యవరకు పనిచేస్తారు.

ప్రపంచం సౌందర్యంలో మునిగి తేలుతూ వుంటుంది. కాని, క్వారీలలో పని చేసే స్త్రీల హృదయాలు బాధలతో నల్లపడి వుంటవి. బిడ్డల్ని మళ్ళీ వీపులకు కట్టుకుని బ్రతుకుకోసం ఆ నాలుగణాలు చేతులో వేసుకుని పుళ్ళుపడ్డ కాళ్ళతో, అలసి, యీడ్చుకుంటూ దూరంగా వున్న ఆ మట్టి కొంపకు సాయంత్రానికి చేరుకుంటారు. మగవాళ్ళు సంపాదించిది కాస్తా కల్లు కొట్లవద్ద తగలబెట్టి రోజల్లా కష్టించి పని చేసిన స్త్రీలను చావగొడుతుంటారు. వాళ్ళు నేరస్థులు కారు! జీవితం విసుగెత్తి వుంటుంది. ఇదొక రకమైన వుత్సాహం! కార్మిక స్త్రీలకు జీవితంలో ఆశ లేదు. ఆనందం లేదు. హాయీ లేదు. ఓ అణాడబ్బులు యిస్తే సానుభూతిగా మాట్లాడితే అదే వాళ్ళకు పరమానందం. కాని ఇదంతా బాహ్యానికే. స్త్రీలు పని చేయటం, అసంఖ్యాకంగా పిల్లల్ని కనటం, చావటం-మనదేశంలో లక్షలమంది స్త్రీలు యీ స్థితిలోనే వున్నారు.

భారత దేశంలో ఎక్కడ చూచినా యిదే పరిస్థితి. భారత దేశం ముఖ్యంగా వ్యవసాయపు దేశం కనుక చాలా మంది స్త్రీలు వ్యవసాయపు పనులే వృత్తిగా కలిగివుంటారు. నూటికి ముప్పాతిక మందికి వ్యవసాయపు పనులే- ఏ కాస్త యితర వృత్తులు చేసికున్నా వీళ్ళలో మూడవ వంతు స్త్రీలే. స్త్రీలకు రోజల్లా పని చేసినప్పటికీ ఆదాయం తక్కువ.

స్త్రీలు తల్లులే కారు; భార్యలే కారు; దేశానికి వెన్నెముక యన్న సంగతి పట్టణవాసులైన పురుషులకు స్త్రీలకు గుర్తుకురాదు.

మధ్య తరగతికి చెందిన స్త్రీలు, భాగ్యవంతులు వాళ్ళ యింటి సుఖాన్ని, కుటుంబ క్షేమాన్నే చూచుకుంటూ మూడు పువ్వులు-ఆరుకాయలుగా జీవితం గడుపుకుంటూవుంటారు. వీరి జీవితాన్ని మనస్సులో ఉంచుకుని మన దేశస్థులు, పరాయి దేశస్థులు భారత స్త్రీల జీవితం సుఖప్రదమైన దనీ, చీరలు సింగారించుకుని షోకుగా భర్త చాటునో, సంరక్షకుని నీడలోనో, కులుకుతూవుంటారనే అభిప్రాయం వెలిబుచ్చుతున్నారు. ఒక్కసారి వాళ్ళ జీవితాన్ని పరిశోధిస్తే యివన్నీ తప్పుడు అభిప్రాయాలని రుజువవుతాయి. మన దేశాలలో బీదవాళ్ళే మెజారిటీ.

వీళ్ళల్లో ఎక్కువ మంది కార్మిక స్త్రీలను చూడ గల్గుదుము భారత మహిళా సంఘంవారు 1936లో జాతిసమితికి అందజేసిన మెమొరాండం చూస్తే అనేక విషయాలు బోధపడతవి చిన్న చిన్న పరిశ్రమల్లో పురుషులకంటే పని చేసే స్త్రీల సంఖ్యయే ఎక్కువ పాడి పరిశ్రమలో పని చేసే ప్రతి 1000 మందికి 514 స్త్రీలు 486 పురుషులు కనిపిస్తున్నారు బొగ్గు, కట్టెల వర్తకాల్లో వెయ్యిమందికి 557 గురు స్త్రీలు 443 గురు పురుషులు పని చేస్తున్నారు

బట్టల మిల్లులో ప్రతి ముగ్గురు పురుషులకు-ఒక స్త్రీ పని చేస్తూంది కుమ్మర, చాకలి పనుల్లో ప్రతి 1000కి వరుసగా 309, 417 మంది స్త్రీలు పని చేస్తున్నారు ఆహార పరిశ్రమల్లో 478 గురు పురుషులు 522 గురు స్త్రీలు, పంచదార, బెల్లం పరిశ్రమల్లో 473 గురు పురుషులు 527 గురు స్త్రీలు, ధాన్యాదుల దంపకంలో 185 గురు పురుషులు 815 గురు స్త్రీలు ప్రతి వేయికి పని చేస్తున్నట్టు లెక్కలు తెలుపుచున్నవి

ఇండియన్ లేబరు గెజటు ప్రకారం అస్సాం, సురమావాలీ టీ తోటలలో పని చేసే స్త్రీల సంఖ్య 1942-43 లో 19,198 మిగతా పరిశ్రమలలో పని చేసే స్త్రీల సంఖ్య-1942 లో 182,735 అడపా తడపా పనిలోనికి వచ్చేవారి సంఖ్య 77, 969 ప్రస్తుతం బొగ్గు గనులలో స్త్రీలు పని చేయటం నిషేధించబడినప్పటికి యుద్ధకాలంలో పనివాంౡ్ర కొరతవల్ల స్త్రీలు కూడా బొగ్గుగనులలో పని చేయాల్సి వచ్చింది మన పట్టణ పారిశుద్ధ్యానికి తోడ్పడే అసంఖ్యాక స్త్రీ కూలీలను అంటరాని వారుగా సమాజానికి దూరంగా వుంచి వేశాము చాలీ చాలని జీతం డబ్బులతో విద్యారహితంగా, మానవులకు నివాసయోగ్యం గాని ప్రదేశాల్లోవాళ్ళు జీవించాల్సివస్తూవుంది మానవుడు పాకీ పని చేసి బ్రతికే హైన్య స్థితికి రాకూడదని గ్రహించి, ఆ పని పూర్తిగా యంత్రసహాయంతో కావించాల్సిన అవసరం నేడు ఏర్పడింది

మన దేశంలో కార్మిక స్త్రీలు అనుభవించే కష్టాలు అసంఖ్యాకము పాశ్చాత్య కార్మిక స్త్రీ తన సంపాదనతో తానొక్కరితే బ్రతుకుతుంది కాని మన దేశంలో కార్మిక స్త్రీ కుటుంబంలో ముఖ్యమైన పాత్రను నిర్వహించవలసివస్తుంది, కుటుంబానికి బాగా తోడ్పడవలసివున్నది స్త్రీకి విద్య శూన్యం వైద్య సదుపాయాలు లేక పోవటం చేత రోగాల పాలబడవలసివస్తుంది చిన్న తనంలోనే కాన్పులు రావడం, కాన్పుకూ, కాన్పుకూ వ్యవధి ఎక్కువ లేక పోవడం పిల్లల పోషణ జాగ్రత్తగా జరగక పోవటం, నివాసయోగ్యంగాని మట్టి గుడిసెలు, చిన్న గదిలో కొన్ని కుటుంబాలు నివసించడం వల్ల జీవితం నరక ప్రాయంగా వుంటూంది

ప్రభుత్వము, పరిశ్రమాధికారులు కార్మికుల క్షేమాన్ని నిర్లక్ష్యం చేస్తూవుండటం స్పష్టంగా కనిపిస్తుంది కాని యిప్పుడిప్పుడే అక్కడక్కడ కార్మిక స్త్రీల సౌకర్యం కోసం కొంచెంగా శ్రద్ధ వహించటం కనిపిస్తూంది గనక వారికి మంచి రోజులు రానున్నవని తలచవచ్చును కార్మిక స్త్రీల వుద్ధరణ దేశోద్ధరణయేనని పరిపాలకులు పౌరులు, పట్నవాసులు-పల్లెజనులు అంతా గమనించి, సానుభూతితో వారి సముద్ధరణకై కృషి సల్పవలసియుంది



# మహిళా జాగృతి

## అఖిలభారత మహిళా సభ

మొన్న డిసెంబరు నెలాఖరున యీ మహాసభవారి 19 వ సెషన్సు అకోలా (బీహారు)లో జరిగింది అధ్యక్షురాలు శ్రీమతి ధన్వంతి రామరావుగారు - స్వతంత్ర భారత దేశానికై నిర్ణయింపబడే పరిషత్తులో స్త్రీల హక్కులకు తగిన స్థానం యిచ్చేటట్లు చూడ్డానికి సభవారు శ్రద్ధ వహించాలన్నారు సబ్ కమిటీవారు తయారుచేసిన 'చార్టర్ ఆఫ్ వుమన్సు రైట్సు' పరిషత్తు ప్రెసిడెంటుకు పంపించబడింది దాంట్లో ఓటుహక్కు, ఆర్థిక, సాంఘిక, రాజకీయ విషయాల్లో స్త్రీలకు సమాన ప్రాతినిధ్యం యివ్వాలని, స్త్రీ ఐనంతమాత్రంచేత వివాహాల్లో వీరి స్వతంత్ర హక్కులకు భంగం రానీయకూడదని కోరారు స్వతంత్ర భారతదేశ పరిపాలనా భారాన్ని పురుషులొక్కరే నిర్వహించలేరనీ, దీంట్లో స్త్రీలసహకారం అత్యవసరమని హెచ్చరించారు స్త్రీలు సంఘంలో అర్హస్థానాన్ని అలంకరించడానికై పురుషులు తోడ్పడాలన్నారు వచ్చే పాతికేళ్లల్లోను అభివృద్ధి కాన్పించాలంటే భావిపౌరులు కాబోయే పిల్లల తర్ఫీదువిషయమై గట్టి శ్రద్ధవహించాలని చెప్పారు ఇందుకు యింటింటను, ఊరూరను, దేశమంతటను ప్రబోధం జరగాలన్నారు మన దేశపునరుద్ధరణ కృషి జనాభాలో ముప్పాతిక వంతున్న గ్రామాల్లో జరగవలసియుందన్నారు గత సంవత్సరంలో జరిగిన రాజకీయాల్ని సమీక్షించి, జాతీయ మంత్రివర్గం యేర్పడేవరకు విశదీకరించి, జాతీయ నాయకుల విజయాన్ని ప్రశంసించారు దేశంలో మతాల పేరిటజరిగిన మరణహోమం అతి శోచనీయాంశమన్నారు మళ్లీ సంవత్సరంలో జరుగబోయే ఏషియాటిక్ కాన్ఫరెన్సును గురించి యీ సభ గట్టి శ్రద్ధవహించాలని సూచించారు సభ సమావేశ సందర్భంలో యేర్పాటు చేసిన స్వదేశీ ప్రదర్శనాన్ని గ్వాలియర్ మహారాణి లక్ష్మీబాయ్ రాజ్ వాడీ గారు తెరచారు

ఇటీవల మిత్రరాజ్య సమితి సమావేశంలో దక్షిణాఫ్రికా భారతీయులతరఫున జయప్రదంగా వాదించిన శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ ను, ప్రపంచ విజ్ఞాన సమావేశానికి భారతదేశ ప్రతినిధిగా వెళ్లిన శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ ను, బొంబాయికి షేరీఫ్ గా నియమింపబడ్డ ప్రథమ మహిళ శ్రీమతి మెహతారామ్ ను అభినందిస్తూ మహాసభవారు తీర్మానాలు చేశారు

అఖిలభారత మహిళా సభవారు యేర్పాటు చేసినసభలో బేరారు మహారాణీగారు ఉపన్యసిస్తూ హృదయ విదారకాలయిన బెంగాలు కల్లోలాల్ని అతి తీవ్రంగా ఖండించారు స్వతంత్ర కవాటంలో ప్రవేశించనున్న భారతజాతి కిది శోచనీయమైన అంతరాయమని చెప్పారు మత సామరస్యం కల్పించడంలోను, శాంతిస్థాపనలోను స్త్రీలకు గొప్పబాధ్యత యుందని హెచ్చరించారు

ఐదురోజులకార్యక్రమంలో సభవారు ప్రాముఖ్యవిషయాలన్నీ చర్చించారు బ్రిటిష్ సేనల ఉపసంహారణ, పోలీసు అత్యాచారాలు, పరిశ్రమల స్థాపన వగైరాల్ని గురించి రిజల్యూషన్సు పాసు చేశారు అఖిలభారత మహిళాసభకు హాజరైన నలుగురు ఆంగ్ల వనితలు, యిద్దరు అమెరికన్ స్త్రీలు —అన్ని దేశాలలోని స్త్రీలూ కూడా శాంతిస్థాపనను గురించి తీవ్రంగా కృషిచేయాలని, ఇందుకు అంతర్జాతీయ సమావేశాల్లో స్త్రీలకు ఎక్కువ స్థానాలివ్వాలనీ చెప్పారు శాంతిస్థాపన స్త్రీలసహజం, క్షమఓర్పులకు సహజమైన పనియని విశదీకరించారు భవిష్యత్తులో ఆటంబాంబుల ఉపయోగాన్ని ఖండించడంలో సర్వదేశాలలోని నారీమణులు ఏకీభవిస్తున్నారని చెప్పారు సభవారు ప్రవేశపెట్టిన చార్టర్ ఆఫ్ రైట్సు అంగీకరింపబడడమే గాక ఆచరణలోకి రావడం చాల ముఖ్యమని అన్నారు

పెక్కురు స్వదేశ ప్రముఖ నారీమణులు, విదేశాంగనలు సభకు హాజరై దిగ్విజయంగా కార్యకలాపం జరిపి లోకానికి సంబంధించిన ప్రాముఖ్యమైన విషయాలు చర్చించారు.



నాది నాది నాది




నాది నాది నాది

# అమృతాంజనము

గాని,

" యధాయధా కాళీధవళత్వ శంకయా "

అమృతాంజనమా ! నీ కీర్తిముల్లోకములను దెల్పుఁజేయు పూనికతో పెరుఁగుచున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

